రెండవ కూర్పు
1948 అక్టోబరు



శ్రీ ఆంధ్ర శేషగిరి రావు, బి. ఏ.

రచియించిన గ్రంథాలు

| | | | రు. అ. పై. |
|---|---|---|---|
| 1. | ఆంధ్రరమణీమణులు 1-వ భాగము | | 0-12-0 |
| 2. | ఆంధ్రరమణీమణులు 2-వ భాగము | | 0-12-0 |
| 3. | కేయూరబాహు చరిత్ర | ... | 0-12-0 |
| 4. | ఆంధ్రరాజభక్తులు | ... | 0-12-0 |
| 5. | ఆకుకూరలు | ... | 1- 0-0 |
| 6. | కాయకూరలు | ... | 1- 0-0 |
| 7. | దుంపకూరలు | ... | 1- 0-0 |

విక్రయము :
ఆంధ్రభూమి బుక్కుడిపో
మదరాసు : 7.

ప్రచురణ :
జయనికేతనమ్
మదరాసు : 7.

*

* *

# విషయసూచిక



*

* *

# PRESS OPINION

## KEYURABAHU CHARITRAMU

Is a prose rendering of a poetical work of the same name by a classical Telugu poet, Manchana. Interspersed in the main story of King Keyurabahu's comical romance are many fables on the lines of those found in the Panchatantra and help to make the book interesting for both young and old.

—*Indian Express*

## ANDHRA RAJABHAKTULU

Short biographical sketches of selected Andhra celebrities who had shown extra-ordinary courage and loyalty in their service to their king and country and made history. The exposition is clear and the style more literary and dignified.

—*Indian Express*

## ANDHRA RAMANEE MANULU

[in two parts]

This book reveals to us the heroism, self-sacrifice, diplomacy and statecraft of the Andhra Women in the Medieval India and the heroines mentioned there-in are beacon-lights to the present generation. One can clearly see that women are not the weaker sex as they are ordinarily dubbed. They can lead armies, conclude treaties and administer states. The book under review is well-written and it will be a source of great inspiration to pupils, if books like this are introduced in Primary and Secondary Schools. —*Swarajya*.

*Printed at the Andhra Printing House, purswalkum, for Jayaniketham, Vepery, Madras,*

# పీఠిక

ఆంధ్రవాఙ్మయమునకు కీర్తిని దెచ్చు ప్రాచీనపద్యకావ్యములలో నొకటియు, శిల్పము మెరయ మంచనమహాకవి రచియించినదియునగు 'కేయూరబాహుచరిత్ర'మున కీగ్రంథము వచనము సేత. ఆంధ్రసారస్వతమందలి కావ్యరత్నములను వచనరూపమునఁ గ్రొత్తవెల్వరించి మన విద్యార్థులకు బాల్యముననే పరిచయము చేయుట శ్రేయస్కరము. ఇట్లు కల్పింపఁబడిన పరిచయము విద్యార్థులమనములను గాలక్రమమున మూలగ్రంథములపయిఁ బ్రసరింపఁజేయును. ఆంగ్లవిద్యావంతులగు నాంధ్రులు ప్రస్తుతము ఆంధ్రకావ్యములపట్ల విముఖులై యున్నారు. బాల్యముననే ప్రయత్నమున నాంధ్రకావ్యరత్నములను మనవిద్యార్థులకుఁ బరిచయము చేసితిమేని యీ విషమస్థితి యచిరకాలముననే తొలఁగిపోఁగలదు. నే నీయాశయముతో నాంధ్రకావ్యభాండారమున నున్నతోన్నతస్థానమలంకరించుచున్న 'కేయూరబాహుచరిత్రము' బాలబాలికలకుఁ బఠనయోగ్యముగ నుండునట్లు వచనమున వ్రాసితిని.

మంచన 'కేయూరబాహుచరిత్రము'ను 'కథలు నీతులై యొప్ప యొడరా' రచియించెను. ఆగుటచే నీగ్రంథము పంచతంత్రము, హితోపదేశములవలె బాలబాలికలందు నీతివిద్యను అంకితము చేయుటలో సమర్థమై యున్నది. మానవుల జీవనమార్గములకు నీతిశీలములవలు చుటకు బాల్యము మంచి కాలము. అందును కథలమూలమున నీతిఁగఱపుట యత్యుత్తమమగు పద్ధతి. కావుట నడుమనడుమఁ బ్రసక్తానుప్రసక్తిగఁ జొప్పింపఁబడి నీతిగర్భితములగు నిందలి కథలఁజదివి బాలబాలికలు తమ జీవనమార్గములు నీతిశిఖరమును జేరునట్లు నిర్మించుకొనుట కవకాశముగలదనుట యెల్లరంగీకరింతురు.

# కేయూరబాహుచరిత్రము

పెండ్లాడినవానిని సార్వభౌమునిఁజేయు వరమునొందిన మృగాంకావళియను నొకరాజకన్యను కేయూరబాహువను రాజునకు నతని ధర్మపత్నిచే భాగురాయణుఁడను నాతనిమంత్రి నిజబుద్ధిబలమున వివాహము చేయించిన వృత్తాంత మిందలి ప్రధానకథ. మూలగ్రంథమున స్థాయిరసము శృంగారము. కాని ఈవచనగ్రంథమున శృంగారలలితములగు వర్ణనములను విడనాడితిని. అవాంతరకథలలో నొకటిరెండు అతిశయ శృంగారదూషితములై యున్నవి. వానినిగూడ నిందు విసర్జించితిని. ఈపుస్తకము బాలబాలికల కొఱకుద్దిష్టమైనది కావున నిట్లొనర్చితిని.

'కేయూరబాహుచరిత్రము'ను వచనమున వ్రాయుటలో మంచన శైలి విడనాడకుండుట కతిప్రయత్నము చేసితిని. కథావృత్తాంతముతోడనే గాక మంచనశైలితోఁగూడ విద్యార్థులు సుపరిచితులుగావలయునని నాయాశయము.

'ఉభయకావ్యసరణిజ్ఞుఁ'డగు మహాకవి మంచన రచియించిన "బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యము" ననుసరించి వ్రాయఁబడిన యిందలి మేలెంచి దీనిని విద్యార్థులకరములందుంప నాంధ్రమహాజనులను వినీతభావముతో వేఁడుచున్నాను.

ఇట్లు

గ్రంథకర్త.

# ౧

# భాగురాయణుని ఆలోచన

కళింగదేశమునందు నింద్రునిపురమువలె నపరిమిత విభవమగు త్రిపురియనునగర మొకటిగలదు. ఆపురికిఁగల పరిఖలు మిక్కిలిలోతయినవి; పాతాళలోకమున నివసించు ఉరగకన్యలు వానియందు జలకేళియొనర్చుచుందురు. ఆనగరమునందలి సాలములు మిక్కిలియెత్తయినవి; ఊర్ధ్వలోకమున నివసించు దేవకన్యలు వానియందుఁ గ్రీడించుచుందురు. పురాంగణములందు నవముక్తాఫలరాసులు, నానాసన్మణిశ్రేణులు, శుక్తివితానములు, హేమవాలుకలు నతిప్రీతి సంధించుచుండును. ఆపురిదేవగృహము లెల్లప్పుడును మర్దళధ్వనులతో నిండియుండును. ఆనగరమున గుఱ్ఱము లెన్నఁదగినవి; ఏనుఁగులు నడగొండలవలెఁ జరించుచుండును. అందలి బ్రాహ్మణు లత్రిసమానులు ; క్షత్రియు లర్జునసమాధికశూరులు ; వైశ్యులు కుబేరులు ; శూద్రులు విదురునితో సమానులు ; భటు లుగ్రసింహములు.

అట్టిపురమున కధీశ్వరుఁడు కేయూరబాహుఁడనువాఁడు. ఇతనితండ్రి మహేంద్రపాలుఁడు. ఈ మహేంద్రపాలుఁడు దశరథరాముని తమ్ముఁడగు లక్ష్మణుని పుత్రుఁడైన చంద్రకేతుని సంతతివాఁడు. సూర్యప్రతాపముతో కేయూరబాహుఁడు రాజ్యమేలుచుండెను. ఆమహారాజు కృపాసముద్రమునకు ధరణీతలముపైఁగల మానవేంద్రులు సాటిమానిసులైరి. ఆతనికీర్తి దశదిశాంగనాపాపటబొట్టులకు ముత్తెంపుసూచక

మైనది. ఆతనికరవాలము రిపుసంఘములకు బద్ధకవాట
గోద్వారమునఁ గుంచెకోలయైనది. ఆతనిప్రతాపమునకు నుద
యాస్తగిరులు దీపికాస్తంభములైనవి. ఇట్లాదిమహీనాథనిభ
మహాప్రభావుఁడై కేయూరబాహువిభుఁడు తేజరిల్లెను.
చతురప్రజ్ఞుఁడగు చంద్రగుప్తునికిఁ జాణక్యునివలె, సుమనశ్శ్లా
ఘ్యుఁడగు వత్సాధిపతికి యుగంధరునివలె, దివస్పతియగు
నింద్రునకు బృహస్పతివలె శుంభత్పుణ్యుఁడగు కేయూర
బాహునకు భాగురాయణుఁడను నాతఁడు ప్రెగ్గడయై ప్రఖ్యాతి
వహించెను.

భాగురాయణుఁడు ఆరోగ్యవద్దేహుఁడు; అగుటచే
నాకారశాలి. వంశక్రమాగతమైన విస్తారబుద్ధి గలవాఁడు.
శూరుఁడు ; ధీరుఁడు—అయినను దయాన్వితుఁడు. నిజమర్మ
గోపనమునఁ బరమర్మభేదనమున నేర్పుగలవాఁడు. సంప
న్నుఁడు ; గంభీరుఁడు—అయినను సాదరోక్తిశీలుఁడు. ప్రజా
నందకరుఁడు. ఉత్తమాన్వయుఁడు ; సర్వవిద్యానిధి ; అగుటచే
నాచారవిశిష్టుఁడు. ఆలస్యరహితుఁడు. ఔచిత్యపరుఁడు. నిఖిల
చిత్తవిదుఁడు. లీలవాఁడు—అయినను వ్యసనవివర్జితుఁడు.
ఇంతకును దనయేలికయందు విశేషమైన భక్తివిశ్వాసములు
గల చెలికాఁడు.

తేజోరాశియైన కేయూరబాహుమహీనాథునకు రత్న
సుందరి యనునామె దేవేరి. ఆమె యేణీలోచన ; కళ్యాణా
కార ; హేలామనోహారి. అగుటచే నాతఁ డెల్లప్పుడును నా
లీలావతితో విహరించుచుండెను. రమణిమీఁది మోహమున
నారాజు రాజ్యతంత్రములయెడ విముఖుఁడాయెను. ఇట్లేకరస
ప్రమత్తుఁడగు నేలికచందముచూచి భాగురాయణుఁడు గాఢ

చింతాకులబుద్ధియయ్యెను. "ఈ కొఱగాని చందములనుండి నరనాథుని నెడచేయుటకు నా కుపాయ మెట్లు చేకూరు" నని ఆతఁడు చిత్తములోఁ దలఁచుచుండెను. ఇట్లుండ నానాదేశ ముల కాతఁడు పంపఁగాఁ బోయియుండిన చారులలో ధీనిధి మతిమంతుఁడనువాఁ డొకఁడు వచ్చెను. వచ్చి సమయకర్తవ్య ములు నడపి వాఁడేకాంతమున మంత్రి కిట్లని విన్నవించెను.

"సచివభూషణా! తమయానతినంది నేను లాటదేశము నకుఁ బోయితిని. అక్కడ నే నరసివచ్చినవిశేషము లెఱింగిం చెదను, వినుము. మహారాష్ట్రాధినాథుఁడగు పరిఘబాహుఁడు తనమీఁద దండెత్తివచ్చుచున్న వర్తమానమువిని యతనియుద్ధతికి నోర్వఁజాలక లాటేశ్వరుఁడగు చండవర్మ చింతించుచున్నాఁడు. మఱియొకరహస్యము గలదు. ఇది యితరులెవ్వరికిఁ దెలియ నిది. నివేదించెదను. అవధరింపుము. ఆలాటజనపతికిఁ ద్రిభు వనసౌందర్యవిభవలక్ష్మి యనఁదగిన కూఁతు రొక్కతె గల్గెను. తనయన్వయమునఁ బూర్వు లేకసంతతులగుటయుఁ, దనకు సంతతమందు పుత్రుఁడు పుట్టకుండుటయు, నిప్పుడు పుట్టినబిడ్డ స్త్రీయగుటయుఁ గెలనివారు తెలిసికొనిరేని నిటుమీఁద గద్దె నెక్కుట కెవ్వరును దిక్కు లేరని చులుకనఁగాఁ జూతురని తలఁచి లాటేశ్వరుఁడు బిడ్డపుట్టినప్పటినుండియు యుక్తిచాతుర్యముచేత సుతుఁడని ప్రకటించుచుండెను. ఈరహస్య మతనికి, నతని దేవేరికి, బిడ్డను పెంచిన దాదికిఁ దప్ప నితరుల కెవ్వరికిఁ దెలి యదు. ఆకన్య పెరిగిపెద్దదై యిప్పుడు జవ్వనముచెంది యున్నది. ఆమెను బొందిన పురుషుఁడు సార్వభౌమ తేజో మహిమనొందునని యొక ముని యామె తల్లిదండ్రులతో నేకతమునఁ బూర్వము చెప్పియున్నాఁడు. ఆ రాజకుమారి పేరు

మృగాంకావళియైయుండ మృగాంకవర్మయని పుత్రనామమునం బిలుతురు.''

ఇట్లు మతిమంతుఁడెఱిఁగించిన వృత్తాంతము విని మెచ్చి మంత్రి వానికిఁదగిన పసదనమిచ్చి వీడ్కొల్పెను.

---

## ౨
## సోమదత్తుని ఉపదేశము

పిమ్మట భాగురాయణుఁడు తనమేనల్లుని సోమదత్తుఁడనువాని పిలిపించెను సోమదత్తుఁడు బహుతంత్రప్రౌఢుఁడు; ధీమంతుఁడు. పిలుపు వినినతోడనే అతఁడు మేనమామదగ్గఱకువచ్చెను. అప్పుడు మంత్రి యాతని నేకాంతమునకుఁ గొని పోయి రాజువర్తనమును, మతిమంతుఁడను చారునిచే వినిన వృత్తాంతమును, తాను చేయఁదలఁచిన కార్యమును దెలియఁ జెప్పెను. మఱియు నిట్లనియెను. 'లాటక్షితిపతి మఱియుతుఁడు. అగుటచేతనే ఇట్లు కార్యాగు ప్తిచేసినాఁడు. మతి యింతలేక బహుజనపతి నయ్యెదననుట తలఁచిచూడఁగాఁ చిన్నపనికాదు.' ఆవచనములకు సోమదత్తుఁ డాసచివోత్తమునితో నిట్లని పల్కెను. ''పరికించిచూచితిమేని వసుమతిమీఁద బుద్ధిగలవారు దుర్లభము కాదు. 'అసత్కృతగుణబహురత్నా వసుంధరా' యనుట నేఁటివచనమా? వెఱఁగందనేల? బుద్ధి యొకనిపాలిటిదా? తొల్లి వైశ్యబాలిక బిమ్మమునకుసరి. తైలముమ్మియు

లాభముఁగొనిన కథ వినలేదా? వినకున్నచో నాకథ యించుక యవధరింపుము.

కాంచీపురమున కాంచనగుప్తుఁడను వైశ్యుఁ డొకఁ డుండెను. వాఁడు బుద్ధిశాలి; అనిర్వాంచనుఁడు. తనసుతునకు వివాహము చేయఁదగిన బాలిక నరసికొని రావలసినదని ఆ వైశ్యుఁడు తగువారినిపంపెను. పంపినవారుపోయి వైశ్యకుల బాలలఁజూచుచు నాపురాంగణమున నొకవింతఁ గాంచిరి. ఒకఁడు సంతలో మూఁడుప్రాలకు నూనెకొనఁదలఁచి చను దెంచి 'బియ్యమునకు సరి తైలమువోయుఁ' డని యడుగుచుం డెను. ఆతనిపలు కెవ్వరును వినుపించుకొనక నవ్వి 'ఏడుమూవి శల బియ్యమునకుఁగాని తైలము మూనెఁడురాదు. అట్టిచోఁ ప్రాలసరి తైల మడిగిన యెట్లబ్బు?' నని గేలిచేయుచుఁ బల్కిరి. అయినను వాఁడిట్లే మఱికొందఱ నడిగెను. అప్పు డొక వైశ్య బాలిక యూతనిఁజేరి 'యిచ్చట ప్రాలకు సరిలెక్క నూనెగలదు. కొనియెదవేని, రమ్మ'ని పిలిచెను. వాఁడు చేరవచ్చెను. మూటదింపించి బియ్యము మంచివగునోకాదో చూచి యామె వానితో నిట్లనియెను. 'బియ్య మొకదానితోఁ గొలుచుకొని దానితోడనే చమురు దిగువాఱఁబోయుదును. నీ కిష్టమైనచో బియ్యమునుగొలువుము. పిదప నీతోడ జగడములాడఁజాలను.' ఆపలుకులకు వాఁ డొడంబడెను. అప్పు డావైశ్యబాల పళ్ళెర మొకటితెచ్చి దానినిండ బియ్యముఁగొని దానితోడనే యుం చులుదిగువాఱఁ దైలము వోసెను. కన్యార్థము వచ్చిన కాం చనగుప్తునివా రీవిధముఁజూచి మెచ్చుకొనిరి; వెంటనేపోయి కాంచనగుప్తునకుఁ దెలియఁజేసిరి. అతఁ డాబాలిక బుద్ధివిశేష మును గొనియాడి తనకోడలుగఁ జేసికొనెను.

కావున, సచివోత్తమా! మతిగలవారు లోకమున లేకుందురా? అయినను మతిగలిగినమాత్రమున లాభము లేదు. మతిగలిగియుఁ దాత్కాలికమతి లేకుండినఁ బ్రమాదమువచ్చును. మతిలేనివాఁడు విద్యాన్వితుఁడైనను మేలు వడయనేరఁడు. విద్యాన్వితుఁడయ్యును దొల్లి గార్గ్యుఁడు విమతియై యొకపులిచేత హతుఁడయ్యెను. ఆకథ యెట్లందువా? చెప్పెదను. వినుము.

గార్గ్యుఁడను విప్రుఁడొకఁడు పెక్కుకష్టములఁ బడుచు నొకదుర్గాటవిలో దుర్గారాధనముచేసెను. అప్పు డంబిక ప్రత్యక్షమై వరమడుగుమనియెను. ఆమెకుమ్రొక్కి గార్గ్యుఁడు 'పరమేశ్వరీ! దయయుంచి నాకు సంజీవనినిమ్మ'ని సరభస మగు కాంక్షతో వేఁడెను. తలఁచినమాత్రమున నాత్మకరము నకువచ్చిన కొన్నిపచ్చనియాకుల నాతనికిచ్చి దుర్గ యిట్లు చెప్పెను. 'వీనిరసముఁ బయిపయిఁ జిలకరించినమాత్రమున శవములకుఁ బ్రాణములుకలిగి ముందటిరూపము వచ్చును. తేజమును, బలమునుజెంది యెప్పటిరీతిని చరింపఁగల్గును. ఈయాకులు ఎండిపోవు. తఱుఁగవు.' ఇట్లుచెప్పి చండిక పొడఁగానరాక చనెను. నిండినసంతసమున విప్రుఁ డవికొని ఆత్మపురముత్రోవఁబట్టి పోవుచుండెను. నిర్మనుష్యమగు నా యడవిమార్గమున నొక్కఁడును బోవుచుండ నాతని కొకచోట పొదరింటికి వెలుపల నొకపుండరీకశవము కనిపించెను. దానిని సమీపించి కుబుద్ధియగు నాతఁడు తానుపొందిన ఔషధశక్తినిజము పరీక్షింపనెంచెను. తోడనే ఆ విప్రుఁడు చేతితో నాకులను నలిపి పుండరీకశవముపయిఁ బసరుపిండెను. పిడిచి నంతనే—యేమిచెప్పుదును?—భీకరపుండరీక మప్పుడే నిద్ర

మేల్కాంచినట్లు బొబ్బరించుచు లేచి యావేడఁగువిప్రుని చంపి క్రమింగివైచెను. మేలువడసియు బుద్ధిచాలని యభాగ్యులిట్లే దానిఫల మందనేరరు. కళాకృషికి మతియే బీజము. మతియే తనకు ఫలమునొసఁగఁగల వృక్షము. మతియే చెలి. మతియే చుట్టము. అరసిచూడ భూమియందు మతిహీనులు మొరడు మ్రాఁకులు.

ఈప్రసంగ మట్లుండనిమ్ము. మనరాజు వర్తనములఁ దడవి చేయువలసినకార్యము చేయవలయును. ఏరసమునం దెవనికి నెక్కుడుప్రియమో, యారసమునం దాతనికి నభినవ రుచివిస్తారము పుట్టింపవలయును. అప్పు డాతనిమనము మున్ను చేరిన దెసవిడిచి క్రొత్తదిక్కునఁ జేరును. ఇన్నిమాట లెందుకు? రత్నసుందరికి సిద్ధైనమేల్కొటి నింకొకదానిని గనఁబఱిచి మనసారాటపడఁజేసినఁగాని భూమిపతిని పూర్వస్థితికిఁ దీసికొనిరాలేము. కావున మన మిపు డిక్కడకు మృగాంకావళినిఁ గొనితెచ్చి చూపి మనరాజుమనము రత్నసుందరినుండి మరలింతము. పిదప నాకన్యనువరించి మననృపాలుఁడు సార్వభౌమత్వమునుజెందును. అపాయములేని యీయుపాయము మిక్కిలి శ్రేయస్కరమైనది. దీనినిమించి కార్య మింకొకటిలేదు. ఆకన్యకారత్నము నిచటికిరప్పింప నిది మనకు మంచిసమయము. అది యెట్లందువా? లాటరాజు రత్నసుందరికిఁ బినతల్లి భర్త. అగుటచే మనము బాంధవము దోఁచునట్లుగా 'పరిఘబాహుతోడ యుద్ధముచేయు సమయమున నీ పుత్రుఁడు మృగాంకవర్మ యచ్చటనుండుట మంచిదికాదు. కావున నిచ్చటికిఁ బంపవలయు'నని దేవిపేర లేఖవ్రాసి మనవారిని గొందఱను అచ్చటికిఁబంపుదము. ఈ యాహ్వానమునకు లాట

రాజును, అతని దేవియు మిక్కిలి సంతసించి మృగాంకావళి నిచటికిఁబు త్తెంతురు. ఇట్లు మన మతనికిఁ బ్రియముఁజేసిన వారివలెఁగనిపించి మనకార్యము నిర్వర్తించుకొందము. మా కయి వీ రీపనుఁజేసిరని అన్యులు ప్రియమందఁగా నయవం తులు నిజకార్యప్రయోజనమునకై పనులొనర్తురు. కావున మనము మనకొఱకు చండవర్మ కతిమిత్రులమై యాతని కొమార్తె నిచటికి రప్పింతము. ఇదియే కార్యము."

ఇట్లు మేనల్లుఁడు సోమదత్తుఁడు వినిచిన నీతివాక్య వివరణమునకు భాగురాయణుఁడు మిక్కిలి సంతోషించెను. ఆతనిమాటచేకొని మంత్రిసత్తముఁడు సేవకు నొకనిఁబంపి లాట పతి కూర్మిసుతను రప్పించి తనయాలయమున విడియించెను. పిమ్మట మంత్రి రత్నసుందరీదేవిచెంతకుఁబోయి యిట్లు విన్న వించెను. "లాటవిభుఁడు పంపఁగా నాతనిసుతుఁడు మృగాంక వర్మ మననగరమునకుఁ జనుదెంచియున్నాఁడు. ఆతఁ డేలిన వారి యనుజుఁడుగావున వే ఱొకతావున విడియుట యనుచిత మని మానివాసమున విడియించినాము." ఆ మాటలకు దేవి కున్నతప్రమదము గల్గెను.

అంతట మంత్రివరుఁ డాత్మకార్యభారధూర్వహమునఁ బర్యాప్తుఁడాయెను. దేవిపరిచారికలలో దృఢవివేకినియగు కళా వతి యనుదానిని ఆత్మకార్యానుకూల్యమునకుఁ బొందుపడఁ జేసికొనెను. అతఁ డాపరిచారికకు మృగాంకావళీవిధము సమస్త మును దెలియఁజెప్పెను. బహుమానములిచ్చి సమాధాన పఱిచి కళావతి నారాజకుమారికకుఁ జెలికత్తెయైయుండ నిలి పెను. ఇంతలో నొకయుపాయమును దలఁచి భాగురాయణుఁ డపూర్వశిల్పధీమంతుల రప్పించెను. కేయూరబాహు సభ్యాం

తరమందిరమునకు నావల దవ్వుగా నసమానసుందరమైన నూతనహార్మ్యరత్న మొకటి వారిచే నిర్మింపఁజేసెను. అది సుషిరకుడ్య స్తంభయంత్రమగు గృహము. ఆవిధము రాజు మొదలగువా రెవ్వ రెఱుఁగరు. ఆయతమై యామందిర మభినవమును, మనోహరమునై యుండెను. అగుటచే రాజు దానిని తనశయనమందిరముగా నుపయోగించుచుండెను.

# 3

# పరిచారికల ప్రసంగము

ఇట్లుండ నగరిలో నొకనాఁ డొకకలహము నడచెను. మేఖలయని యొకదాసి. అది రాణిదాదకిఁబుత్రిక. అగుటచే నామె రాణికిఁ బ్రాణసమమైయుండెను. రాజు నెచ్చెలి, విదూషకుఁడునైన చారాయణుఁడను విప్రునితో నామేఖల యడ్డులేక కలహించెను. ఆవిధమెఱిఁగి రత్నసుందరి పరిచారికలగు మకరందిక, సుమతి, సుకుమారిక లనువారు ముగ్వురు నగరిలో నొకచోఁ జేరి యేకాంతగోష్ఠినుండి చారాయణమేఖలావివాద ప్రసంగములగు మాటలాడుచుండిరి. అప్పుడు సుమతి యిట్లనియెను.

"నగళ్లలోఁ దిరుగు పరిజనములకు మొగమోటమి, గరిమము, అడఁకువ, తగవు, ఉచితము, మెలపు, తాలిమి లోనగు సుగుణము లుండవలయును. చారాయణమేఖల లెట్లు పోరఁదొడఁగిరో చూచితిరా? ధాత్రీరమణు నెదుటఁబడుదు

మని విచారింపకున్నారు. రాజసమతులగురాజులు తమనైజ గుణము నప్పటికిఁ గప్పిపుచ్చి ప్రజలతో వ్యవహరింతురు. అంత మాత్రమున వారిని సాధులని నమ్మరాదు. సన్నపుఁగార్యములకై చలమునఁ బ్రజలు తమలోఁ దాముపోరిన మహీతలభర్తయు త్తలుఁడై వారిని జెఱచును. శశమును, గపింజలమును వాదులాడి తమరాజుచే మృతినొందినకథ వినలేదా? చెప్పెదను. వినుఁడు.

నర్మదానదితటమున నొకతరుకుంజమునం దొకపులి కాఁపురముండెను. అది తనహింసాకర్మ మొరు లెఱుఁగకుండఁ గపటధార్మికవృత్తిని జరించుచుండెను. ఇట్లుండుటచేత నా శార్దూలమును నమ్మి యొకనాఁ డావనమునందలి మృగము లన్నియు దానిని సమీపించి తమ్ముఁ బరిపాలింప వేఁడెను. వాని ప్రార్థన మంగీకరించి యావ్యాఘ్రము 'నేను హింసాధర్మమున మిమ్ము దండనమొనరింపఁజాలను. కాని న్యాయాన్యాయములు నిర్ణయించి మిమ్ములఁ దగురీతిని శిక్షింపఁగలవాఁడ'నని నుడివెను. అట్లావిధమునఁ జెల్లుచుండ నొకనాఁడు శశమును, గపింజలమును జెట్టుతొఱ్ఱకై వాదులాడి తమరాజగు పులిచెంతకుఁబోయినవి. పోయి మ్రొక్కి పులికి నిజవాదములు వివరించినవి. ఆవ్యాఘ్ర మప్పుడు వానితోడ 'ముదిసినారము. దృష్టి మాంద్యమునొందినది. దూరమునుండి చెప్పిన మాట పటివలె మాచెవులకు వినఁబడదు. కావున దగ్గఱకువచ్చి మీ కార్యమును జెప్పుఁ'డనియెను. అవియుఁ దేకువమాలి పులిని జేరెను. అప్పు డది ముందటికాళ్ళతో వానినిబట్టి భక్షించి సంతోషమువనుండెను. కావున చిన్నవియగు కార్యములను పెద్దవిచేసి చలమునఁబోరరాదు. అట్లుపోరిన నది రాజులా

చెప్పఁబడును. అప్పు డిరుదెఱఁగులవారికిఁ జాలఁగీడగునను
టలో సందేహము లేదు."

ఇట్లు సుమతి యెఱిఁగించిన కథ విని మకరందిక యీ
విధముగా నుడివెను. "ఎందును బోరొప్పదు. అల్పులుపోరిన
నది యంతతోఁబోక బలిసి విపదాధారమగును. తొల్లి తొం
డలుపోరిన జనులకు బాధపుట్టినవిధము వినలేదా? వివరించెదను.
ఆకర్ణింపుఁడు.

మాణిక్యసేవనుఁడను పేరుగలయొకరాజు. అతనికి
జైనులయెడ భక్తి విస్తారము. అగుటచే నాభూపతి యడవికిఁ
జేరువ నగాధసలిలమగు నొకతమ్మికొలనిపొంత సమీచీనముగ
వసతులుగల్పించి, యందు సకలపదార్థసంచయములును సమ
కూర్చి జైనుల నందుండఁగోరెను. వా రామనోహరస్థలము
తమయనుష్ఠానవిధికిఁ దగిన యేకతంపునెలవని సంతోషించి
యందుండిరి. అట్లుండ నొకనాఁ డచ్చటి నీరజాతవనతీరోపాంత
కుంజమునం దొకచోట తొండలు కొట్లాడెను. అం దొకటి
మఱియొకదానిని వెన్నంటితఱిమెను. అట్లు తఱుమబడిన సరట
మేవంకకుఁబోవుటకును జోటుగానక కొలనిలోఁ గ్రీడించుచున్న
యొక కాంతారమదేభము కర్ణాంతరవివరములోనికిఁ జొట్టి
తొట్రయని దురదురఁదూఱెను. అప్పు డాకరి చమత్కారముఁ
జేసి తొండముఁద్రిప్పుచుఁ గొలను వెడలివచ్చెను. మహాఘీం
కృతులుచేయుచుఁ, బొదలు మ్రాఁకులు గూల్చుచు నాదంతి
యుగ్రమూర్తియై జైననిలయములఁజొఱఁబడెను. అట్లు చొఱఁ
బడి ఆయేనుఁగు కొమ్ములనూఁది గోడలఁబడఁద్రోసెను; సద
నముల ఛిన్నాభిన్నముచేసెను. ఇట్లు చేయుచున్నకరిని గనుఁ
గొని జైనమునియూథము గుండెలు జల్లని పడఁక, వస్త్రము

లుమ గుంచెలును విడిచి, యేదెసఁ బాఱుటకును దోఁపక తొట్రుపడుచుండిరి. అప్పుడు వేదండము వారిలోఁ గొందఱను కొమ్ములతోఁ బొడిచి చంపినది; కొందఱను కాళ్ళతోఁ ద్రొక్కి మట్టుపెట్టినది; కొందఱను దొండముతో విఱిచి వధించినది. అప్పు డా ప్రాంతమంతయుఁ బీనుఁగులతో నిండిపోయెను. నెత్తురు కాలువలుగట్టి ప్రవహించెను. అట్లు జనులవధియించి, మిగిలిన వసతులఁ బడఁద్రోసి యా వారణము కొలనుచొచ్చి, తిరిగి సరోరుహాకులము నెల్ల భగ్నముకావించెను. పిమ్మటఁ దొండమునిండ నీరుపూరించి ఆయేనుఁగు దరికివచ్చి తనచెవిలో నానీరు గురియించెను. అప్పుడు సరటము తల్లడమంది బయటఁ బడెను. కరి సమ్మదమందెను. సరటకలహము చేరువనున్న జైనకులమునకుఁ, గాసారమునకుఁ జేటుఁదెచ్చినట్లే అల్పులొనరించు దుష్కలహములు చేరువనున్న ఘనులకుఁగూడఁ జేటావహిల్లఁజేయును.''

ఈవిధమున మకరందిక యెఱిఁగించినఁ గొనియాడి సుకుమారిక యిట్లు వచించెను. ''అలుక, మదము, గర్వము గలిగి యకారణవిరోధము నొందు జనులచేఁతలు మధుబిందుకలహములవలెనే ఆపదలఁగల్గించును. లాటనరపతిపురమునఁ దేనె నమ్ముకొనెడు కొకఁడు కలశమునిండఁ దేనెపూర్చుకొని మూఁపునఁబెట్టుకొని ఆనగరమునందలి యొకసన్నపువీథిని నడచుచుండెను. మదాంధమైనయేనుఁ గొకటి అప్పు డెదురుగా రాఁబోడఁగెను. పురజనులు దవ్వుదవ్వులకుఁ దొలఁగుచుండిరి. అది చూచి వాఁడు భీతుఁడై తత్తరించుచు, వడఁకుచుఁ, దొట్రుపడెను పదములను నిలువఁద్రొక్క లేక క్రమొగ్గతిలఁజాఱెను. అప్పుడు తేనెకుండ తొలఁగుటచే నందుండి కొంతమధువు భూమి

మీఁద నొలికెను. ఆతేనెబొట్టున కచ్చట నీఁగలుముసిరెను. వానిని బట్టుట కొకసాలెపురుగు చేరెను. ఆ సాలెపురుగును గ్రమింగుటకు బల్లి యొకటివచ్చెను. పిల్లియొకటివచ్చి యాబల్లిని తినెను. అప్పుడు రాజాధీనమగు వేఁటకుక్క యొకటి యేతెంచి ఆపిల్లినిగఱచెను. మార్జాలమందుకుఁ గోప మాపుకొనఁ జాలక వేఁటకుక్కమీఁదఁబడి పీఁకెను. ఇదిచూచి వేఁటకుక్కలవా రాపిల్లినిజంపిరి. వాడవా రిదిసహింపక వేఁటకుక్కను జంపించిరి. అంతఁగినిసి కుక్కవేఁటకాండ్రు పోయి కథనంతయు నృపతితోడఁజెప్పిరి. అందుమీఁద మండిపడి ఆరాజు తగవూహింపక యూరివాడప్రజలనుజంప సేననంపెను. 'జగతీవల్లభుఁడైనను మనకేమి?'యని యుత్సాహించి నానాయుధోపేతులయి, యుద్ధసన్నద్ధులయి వాడవారు మహోద్రేకముతో భూపాలకసేననుదాఁకిరి. అంత నిరువాఁగులవారును ఘోరయుద్ధమునొనర్చిరి. పురవీథులు పీనుఁగుపెంటలయ్యెను. ప్రేవులతోడను, కండలతోడను గలసి నెత్తురు కాల్వలయి ప్రవహించెను. సన్నపుఁగార్యమునకై హెచ్చురోసముతోఁ బెనఁగి కుమతులు లాటనృపతిపౌరులవలెనే మహాకష్టముల నొందుదురు."

ఇట్లుచెప్పి మకరందిక ముగించెను. చారాయణమేఖల లిట్లుకలహించుట లెస్సమతము గాదనుకొనుచుఁ బరిచారికలు మువ్వురును నిజేచ్ఛఁజనిరి.

# ౪
# రత్నసుందరి అలుక

అంతఁ గొంతకాలము గతించెను. భాగురాయణుని
చేత నుపదిష్టయగుచు లలితవివేకినియగు కళావతి చారాయణు
నితోఁ జెలిమిసంధించి యాతనికి మేఖలను పరిభవింప నొక
యుపాయము నెఱిఁగించెను. కళావతిచెప్పినచొప్పున చారాయ
ణుఁడు మేఖలతోడఁ గపటసఖ్యము నెఱపెను. ఒకదాసికిఁ
బురుషవేషము వేసి చారాయణుఁ డామెను నమ్మించి మేఖలకుఁ
బెండ్లి చేసెను. అచిరకాలముననే మేఖల తనకుజరిగిన పరా
భవమును దెలిసికొనెను. భంగపాటనుశిఖి యంతరంగమెల్లఁ
గాల్చుచుండ నామె ముసుఁగు వేసికొని పోయి రాజయుక్తయగు
దేవియడుగులయొద్ద వ్రాలి యెగిచియెగిచి యేడువసాగెను.
"నిన్న పెండ్లికిఁ బంపుమని కోరినది. తగినవారి నిచ్చి నే నీమెను
ప్రేమతోఁ బంపితిని. నిన్నరాత్రి పెండ్లికదా! దీనికి నేఁ డిది
యేమి వచ్చినది?" యని రాణి వగచుచుండెను. అప్పుడు భూరమ
ణుఁడు సన్నపునగవారు మొగముతో చారాయణుని దిలకిం
చెను. అందుమీఁద నాతఁడు సంతోషపూరితుఁడయి, యధిక
సంభ్రముఁడయి మేఖలతో నిట్లనియెను. "ఇష్టపడి పోయిన
రాత్రి పెండ్లియాడినావు. నిన్ననే కట్టఁబడిన నీమంగళసూత్రము
నేలఁబొరలునట్లిచ్చుట నీవు పొరలఁ గారణమేమి గల్గినదో
చెప్పుము. పరిణయముకొఱకుఁ బ్రయత్నించితివి. అగుటనే
చారాయణుఁడు నీకెందును దుర్లభమైనవరుని వెదకి పెండ్లిచేసి

నాఁడు, నీ కామగఁడు సరిగాఁ డాయేమి?'' ఇట్లు పలికి చారా యణుఁడు పెలుచనవ్వెను.

అప్పుడు జననాయకమహిషి "ఇట్లాడలుటకుఁ గారణ మేమి? వెంటనే చెప్పు"మని యాత్మసఖి నడిగెను. అంత మేఖల యేడ్పుమాని లేచి యవనతిముఖియై చారాయణుఁడు తన తోడఁ గపటసఖ్యమొనరించి తెన్ను తనబంధుజనముల సమ్ముఖ మున—నుత్సవదర్శనకుతూహలమున వచ్చినవారి యెదుర—సరి వారి ముందఱఁ బరిభవించినవిధ మంతయు నీరెలుంగన వెక్కు చుఁజెప్పి మఱలఁ గన్నుల నీరు పెట్టుకొనెను. అది విని దేవి తన వయస్యకు భంగము చేసిన చారాయణునితప్పు రాజుతప్పుగ భావించెను. దరస్మితముతో నొప్పెడు తనమోము చేతితోఁ దుడుచుకొని యోరగఁబెట్టి యపాంగవీక్షణములతో రాజును దిలకించెను. అలుకవహించిన రాణిచూపులకుఁ బుడమిఱేఁడు మనమునఁ జలనమునొందెను.

ఇట్లు రత్నసుందరీదేవి కేయూరబాహుమహీనాథుని చూచినది. వెంటనే దృష్టిమరలిచి "మేఖలా ! విచారింప కుము. నీ కీభంగపాటు విదూషకమంత్రిముచేత నయినది కాదు. ఎల్లసంగతులు మాకుఁ దెలియవచ్చినవి. ఇంక వేయి మాటలేందు?'' కనుచుఁ దటాలున లేచి మేఖలభుజముమీఁదఁ గ్రొమ్మెఱుఁగులు గ్రమ్ము తనచేయిడుంచి చిత్తమునఁ దాప ముచు, మనమున నలుకయు నెసరేఁగ రత్నసుందరీదేవి నిజ నివాసమునకుఁ బోయెను.

శ్రీ

# సుమతివచనము

దేవిపరిచారికలగు సుమతి, సుకుమారిక, మకరందిక లోకచోటఁగూడి యీవృత్తాంతమునుగూర్చి రహస్యగోష్ఠి సల్పుచుండిరి. ఆసమయమున సుమతి యిట్లుపలికెను.

“చెలులారా! మేఖలబేలతనము చూచితిరా? తెలియక తొలుత చారాయణునితోఁ బగఁగొననేల? పిదప నాతనితో నేస్తముగట్టనేల? ద్రోహోక్తులచేత మొదట వైరానలము రాజఁబెట్టి పిమ్మట తిరిగి స్నేహముచేయనగునా? అట్లు చేసినను ఆస్నేహ మపోహమగునుకాని ఒందుఁబాటుకాదు. కపటవచనములు పల్కుచుఁ జెలిమిచేయవచ్చిన బలవంతుని, పగవానిని, ఖలుని తమతోఁ గలుపుకొనినవారికి భూమియందు కీడు మూఁడితీరును. మేఖలయెడ నేర్పుతో చారాయణుఁడు చేసినదంతయుఁ దొల్లి యొకానొకసర్పము కపటోక్తులచేతఁ గప్పలనుజేరి పిమ్మట వానినెల్లఁ దుదముట్టించినట్లున్నది.” సుమతి యిట్లుచెప్పఁగాఁ జెలు “లాకథయెట్టిది? వినవలతు” మనిరి. అప్పుడు సుమతి సఖులతో నిట్లనియెను.

“అహిభేకోపాఖ్యానము సవిస్తరముగ వినిపించెదను. వినుఁడు. వింధ్యపర్వతపార్శ్వమున నొక సాంద్రారణ్యము కలదు. పూచినతీఁగెలు, ఫలభారమున భూమినిమోచిన కొమ్మలు గలిగి మూఁకలుగట్టిన పోఁకమోకలను రాచికొని తిరుగు అడవిపందులతో నాయడవి వర్ణనీయమైయుండెను.

అట్లుండ యుగసంధికాలమునఁ బొడమెడురీతిగా గ్రీష్మతాపము సంధిల్లెను. దానికిఁ బ్రాణులు తల్లడిల్లిపోయెను. ఆ కాలమునఁ బచ్చికయెచ్చటనులేక భూమి పాడయ్యెను. పైఁగా నేల పాతాళముదాఁకఁ బగిలిపోయెను, బిలములు బ్రద్దలైపోవుటచే నుండుటకుఁజోటులేక హీనజంతువు లెండలో మాడి పోయెను. చండాతపముచేత నెండిపోవుటకుఁదోడు చెట్లను బెనుగాలి తుమురుచేసెను. ఆఁకలిదప్పు లను చిచ్చునకుఁదోడు కార్చిచ్చు మృగములఁ గాల్పఁదొడఁగెను. ఆపదలమీఁద నాపదలు విఱుచుకొనివచ్చెను. పట్టిపోయినడొక్కలు వాములయ్యెను. ఆయడవియం దెక్కడఁజూచినను బూడిద, బొగ్గులు రాసులై యుండి సహింపరాకుండెను.

అట్లుండ నాకాననమున నిండనీరుగల్గి యిరవయిన నొకనూతియం దనేకమండూకములు స్నేహితులు, సోదరులు, పుత్రులు, పౌత్రులు మొదలగువారితోఁగూడి నివసించుచుండెను. ఆకప్పలు తమకు మహావేగుఁడను నొకచక్కని మండూకమును రాజుఁగా నిలుపుకొని సుఖముఁగా నుండెను.

ఆ యడవిలో భయదర్శకమను పేరుగల పామొకటి గలదు. ప్రియబంధువుల నందఱను గోల్పోయి బక్కచిక్కి కంఠాశ్రయజీవనమయి తిరుగుచు నాపా మానూతిచెంతకు వచ్చి మండూకనినాదము వినెను. 'నీరుండనిచోఁ గప్పలుండవు. కావున నిచ్చట నీరుండితీరవలె'నని నిశ్చయించి నిండిన సంతసమునఁ బ్రాణములు లేచిరా భయదర్శకము కూపమును గదిసెను. గాంభీర్యసంపత్తికిఁ గుదురైయున్న నూయిగాంచి పాము 'నేఁటికి నాకోరికలు ఫలించినవి. ఆఁకలిదప్పుల నిప్పుడే తీర్చికొందును. ఈ దుష్కాలదినములనెల్ల నిచట సుఖముగా

వెడలఁబుచ్చెద'నని యాలోచనచేసెను. కాని లోనికిఁబోవుట కానాగమునకుఁ దెరువు కనఁబడలేదు. అగుటచే దరినుండి భయదర్శకము లోనఁ బరిజనపరివృతుఁడయి యిరవున నున్న కప్పలరాజును చూచి యిట్లు పలికెను.

'దేవా! భేకకులాధినాథా! నన్ను కరుణాదృష్టితోఁ జూడుము. నీరువట్టుకతమున జీవము నిల్చునట్లు లేదు. శీఘ్రముగా వచ్చి నినుగొల్చుటకుఁ ద్రోవ కనఁబడుటలేదు. దుఃఖమున దూలుచున్నాను. నీవారిని గలయరమ్మని నన్నాదరింపఁ గోరెదను. నాకోరిక మన్నింపవలెను. ఎలుకచాలక మా పెద్దలు మీపెద్దల కెగ్గుచేసి మేలఁగుటయెల్లఁ బాపికొనవలయును. కావున నన్నిపుడు నీశ్రీపాదసమీపమునఁ జేర్చికొనుము. ఓ చారుతరమూర్తీ! మండూకచక్రవర్తీ! ఉరగసంఘములకుఁ గప్పలోడుటయెల్ల నీవు పుట్టకపూర్వము కాని యిప్పుడు మా వారు నీప్రతాప మెఱిఁగిరి. ఇఁక మావారు కప్పలనుదొరయు భయపడకుందురా? హనుమంతుని ప్లవంగమందురు? నిన్ను కూడ నాపేరుతోడనే పిలుతురు. ఇంద్రుని హరియందురు, నిన్నుకూడ హరియని చెప్పుదురు. ఇట్టిప్రఖ్యాతి నీకుఁజాలదా?'

ఇట్లు తన్ను వినుతింప విని కప్పలరాజుబ్బిపోయి 'నామంత్రుల అనుమతమున నిన్ను రప్పింతును. సంతోషముతో వచ్చుట నిలువు'మని పాముతో ననెను.

అంతట మహావేగుఁడు తనమంత్రుల రావించి వారి కాపని యెఱిఁగించెను. దానికి మంత్రులు 'పాములపొత్తున జీవించుట మనకు వశముకాదు. దీనిని ఏమని యొకగొప్పకార్యముగాఁ దలపోసెద'వనిరి. అయినను మండూకేశ్వరుఁడు సర్పబాంధవమును విడనాడలేదు, ఏలిక మోముచూచుచు నప్పుడు

స్నేహితుఁ డనుకప్ప యిట్లు చెప్పెను. 'కుజనుఁడగువాఁడు తన కాపదకల్గినప్పుడు దైన్యమునొందును. ఎదురువాసినతోడనే సిగ్గువిడిచి యాతఁడు తాను పట్టపురాజునని తలఁచి గర్వించును. సుజనులగువారి చెలిమియుఁ, గుజనులగువారి యలుకయు శిలాక్షరములవలె శాశ్వతమైనవి. సుజనులగువారి యలుకయుఁ, గుజనులగువారి చెలిమియు జలాక్షరములు, క్షణభంగురములు.'

పిదప కృష్ణరూపియను మండూకము తనరాజుతో నిట్లనియెను. 'అరసిచూచినచో దుష్టజనులు తాము కావించు దుష్కార్యములకుఁ బుట్టుగ్రుడ్డులయి యుందురు, తమయాచారమును, తమధిగరితనము పొగడుకొందురు. తమబాగే కాని యొరులబాగు చూడఁజాలరు. పరులదోషముల నెప్పుడును దివ్యచక్షువులై యుందురు. ఇతరులప్రజ్ఞను బ్రశంసింపవలసినసమయములో నెల్లప్పుడు మౌనవ్రతులై యుందురు. అన్యులనిత్తకారణముచేయు మహాపురుషుల ద్వేషింపుచుందురు. రాజా! దుర్జనులను జేరనీయరాదు. చేరనిచ్చినచో సేగియు, వినాశనము చేకూర్తురు. పూర్వము కాకమును జేరనిచ్చిన హంసముల కెట్టిచేటు మూఁడెనో యెఱుఁగుదురుగదా!

కృష్ణరూపి యిట్లు చెప్పఁగా మండూకేశుఁ 'డాకథ యెన్నఁడును వినలేదు. కాకమును హంస లేవిధముగఁ జేరనిచ్చినవి? వాని కాకాకివలన నెట్టికీడు కల్గినది? చెప్పవలసినది.' యని పలికెను. అందుమీఁద కృష్ణరూపి యిట్లని ఆకథ చెప్పఁదొడఁగెను.

'ఒక పర్వతముమీఁద నొకకొలనుండెను. అందుఁ గొన్నిహంసలు ఇచ్ఛానువృత్తిఁ బగలెల్ల విహరించుచు భానుఁ

డస్తమించినతోడనే పాపాత్ములకుఁ జేరరాని యున్నతోన్నత
మగు నొకగండశిలపై రేయెల్ల సుఖమున గడుపుచుండెను.
ఇట్లుండ బోయఁ డొకఁ డాయంచలఁబట్ట నపేక్షించెను ; వాని
నెలవు తెలిసికొనెను. కాని ఆగండశిలపయికిఁ బోఁజాలక
బోయఁడు తిరిగిపోయెను. అంత నొకనాఁడు కాక మొకటి
ప్రొద్దుగూకినవేళ నా గండశిలమీఁదుగాఁ బోవుచుఁ బక్షుల
రొదవిని వానినిజేరవచ్చెను. అట్లువచ్చిన కాకినిచూచి హంస
యూథమెల్లఁ 'కాకమా! యెక్కడనుండి యెక్కడకుఁబోవు
చుంటివి ? నీ వెందుకొఱ కిచ్చట నిలిచినా'వని యడిగెను.
దానికి నాకాక మిట్లుబదులుచెప్పెను. 'నేను పగలంతయు
నాహారము నేఱి తిని కడుపునిండఁగా నాయునికిపట్టునకుఁ బోవు
చుంటిని. కాని ప్రొద్దుచాలకుండుటచే నిచ్చట నుండవలసి
వచ్చెను. ఇది నావృత్తాంతము.' అప్పుడు హంసగణమం
తయు 'సరే! ఈరాత్రి కిచ్చటనుండు' మనెను. ఆమాటలకు
మతిమంతుఁడను హంసమాత్రము సంకటపడియెను. అతఁడు
తగ వెఱిఁగినహంస ; సుగుణుఁడు. అతఁడు మిగిలినహంసలతో
నిట్లుచెప్పెను. 'కాకిభోజనము ఎంగిళ్ళు, శవమును, క్రూర
మైన ఇట్టియెగ్గులు వేయి చెప్పవలసిన పనిలేదు. పక్షులందుఁ
గాకము ముట్టరానిదనెడిమాట సుప్రసిద్ధము. మీరు విన
లేదా ? ఈరాత్రి యిది మనకడ నుండఁగూడదు. ఉండిన
నేఁడో రేపో మనకుఁ గీడువచ్చితీరును. అట్లు రాకున్నను
కొలఁదిదినములలోనైన వచ్చితీరును. ఇది నిజము.'

అప్పు డామతిమంతు నుద్దేశించి కార్యమెఱుఁగని తరుణ
మరాళములు కొన్ని 'దీనినిగుఱించి ఇంతవాద మనవసరము.
ఈకాకి యొక్కటి యొక్కరాత్రి యిచ్చటనుండిన మాత్రమునఁ

గీడుకల్గుననుచుఁ గీడువచ్చుట భయముకాని తెలివికాదు. ఎక్కువబుద్ధులు నేర్చినవారి కెక్కువభయ మనుమాట నిజము. ఇఁక బహూక్తులుమానుము. ఇదియునుగాక, పాప మీకాక మీచీఁకటిలో నెక్కడకుఁ బోఁగల?' దనిపలికి దానినుండఁబనిచి యభీష్టములయిన ఫలములు భోజనమిడెను. ఆవాయస మా రాత్రి యచ్చటవసియించి, రెట్టఁబెట్టి, యర్కోదయమగుట తోడనే వెడలిపోయెను. అంత దానిరెట్ట శిలలసంధియందు నిలిచెను. అందుండి వటభూజఫలములోని బీజము మొలక యెత్తెను. ఆమొలక నానాఁటికిఁ బెరిగి యాకాశమునంటు కొమ్మలతో నొప్పుచుండెను.

నూఱిపదియేండ్లు గడచినంత నామహావృక్షము భూమి లోనికి నూడలఁబాఱించెను. వానినిబట్టి కిరాతుఁడు చెట్టు మీఁద కెగఁబ్రాఁకి యచ్చట నురులొగ్గెను. ఉచ్చులుపన్ని నిషాదుఁడు చనినపిమ్మట భాస్కరుఁ డపరాద్రిని జేరెను. అప్పుడు సితచ్ఛదములు జలజాతవనమునందుఁ గ్రీడమాని వచ్చి శాఖిశాఖలపై వ్రాలి వాగురలఁజిక్కి కుంద నారంభించెను. విచారించుచున్న హంసములనుజూచి మతిమంతుఁడు 'మన కీపాట్లువచ్చుటకుఁ గారణమును గనుఁగొంటిరా? వృథాహం కృతిని నామాటలు విననొల్లక మీ రెల్ల నాతో వాదాడి ఆనాఁటిరాత్రి నిల్పిన కాకము రెట్టలో నీ మఱ్ఱిమ్రాను మొలిచి నది. దీనినుండి పాఱిన యూడలనెగఁబ్రాఁకివచ్చి గదా బోయఁ డీజాలము నొగ్గినాఁడు? తగువానిపలుకులు చేకొనుట, అడఁచి పడకుండుట, తమవారలతో సగుణత్వముగొనుట ఇవి యుత్త ముల గుణములు. అట్లుగాకుండుట అధములగుణము'లనెను.

అందుకు హంసలు 'మహాత్మా! నీపలుకులు చేకొనకుండుటచే మన కిపు డిట్టికీడు పుట్టినది. అలవియైనచో నుపాయముచేత నీయాపద గడవఁబెట్టి నిన్ను, హితబంధువులమగు మమ్ములను గాపాడుకొనుము. నీవు పనిచినట్లుచేసి భటభావముతో మెలఁగెద' మని చెప్పినవి. అంత మతిమంతుఁ డిట్లని యెను. 'అన్యోన్యవశత్వముగలిగిన బంధుజను లాపదల నుపాయమునఁ దొలఁగించుకొనఁగలరు. పూర్వము కమఠము లన్యోన్యవశత్వమున గరుడబాధగడచినవి. ఇది నిజము. కావున భయమువలదు. ఆకథ వినుఁడు.

పూర్వకాలమునం దంబుధితీరమునఁ గూర్మములు చరించుచుండఁ బక్షిరాజు గ్రుడఁడు ప్రతిదినము వానిని బట్టి భక్షించుచుండెను. ఇట్లు జరుగుచుండఁగా నొకనాఁడు కూర్మముఖ్యుఁడొకఁడు వననిధినీట నిలిచి ఖగవల్లభునితో నిట్లని యెను. 'ఓపక్షిరాజా! దేవరవారివలన నా బంధువు లెల్లరును ద్రుంగినారు. నేనొక్కఁడనే మిగిలియున్నాను. నీకు నాకు నొకపన్నిదముగలదు. అది నీకు సరిపడునేమో చెప్పుము.' ఆపలుకులకుఁ బక్షి నవ్వుచు 'నది యేమిపన్నిదము? చెప్పు' మనియడిగెను. అందులకుఁ దాబే లిట్లు బదులుచెప్పెను. 'ఖగరాజా! మనమున కోపింపక నేనుచెప్పుమాటల నవధరింపుము. ఉడువీథిని నీవు యెగురుచుఁబోవుచుండఁగా నంబుధిలో నే నీదుచుఁబోయెదను. ఇందు నిన్ను నేనుగడచి పోయినచో మమ్ము నెన్నఁడును భక్షింపకుము; నే నోడి పోయినచో నీవు మాకులము నెల్ల నాహారముగాఁ గొనుము.

ఈవిధమునఁ బన్నిదము వేయఁదలంపుగలిగినచో నొకనాఁ డిచ్చ
టికి విచ్చేయుము.'

దానికి సుపర్ణుఁ డొడంబడి వెడలిపోయెను. అనంతర మాకూర్మము తనచుట్టముల నందఱ నొకచోటికిఁ జేర్చి తార్క్ష్యునితోఁ దానొడఁబడివచ్చిన చందమంతయుఁ జెప్పెను. దానికి వారు 'నిన్నుమించిన మతిమంతుఁడు మనలో లేఁడు. కావున మమ్ముబంపుము. ఏపనినైనఁ జేయుదు'మనిరి. అనఁగాఁ గూర్మముఖ్యుఁ డిట్లువచియించెను. 'అయినచోఁ జెప్పెదను. వినుఁడు. మనమందఱము నొకనిముందు నొకరుజని సముద్రమున వేచియుండుము. ఖగస్వామి యాకాశమునఁ బరుగెత్తుచుండఁగా నీరమున నాతని కాముందటివాఁడు పొడచూపుచుండవలయును.' ఇట్లుపదేశించి యాకూర్మముఖ్యుఁడు విహగవల్లభుతోడఁ దానుమాటలాడినచోట వేచియుండెను. మిగిలినకచ్ఛపము లొక్కొకమైలువాసి యనేకయోజనముల దాఁక నొకదానిముందఱ నొకటి నిలిచియుండెను. మఱునాఁడు గరుడుఁడు చనుదెంచి కూర్మముఖ్యునిబిలిచి పందెము వైచెను. వారిధిపైని నంబరవీధిని అతివేగముగఁ జాలదూరము పోవుచు గరుడుఁడు కచ్ఛపము చిక్కనోపునని చీరిపిలుచుచుండెను. కాని అంతకుముందఱనున్న తాబేలు నీటిలోనుండి 'ఓ' యనుచు నగ్రమునఁ దోఁచుచుండెను. ఇది చూచి సుపర్ణుఁ డాశ్చర్యమునొంది వాయుగతినిబఱచి మఱలఁ బిలువగా నచ్చటికమఠము మాఱుపల్కి ముందఱఁ దోఁచెను. ఇట్లు చాల దూరముచని సుపర్ణుఁ డలసి యోడి లజ్జితుఁడయి 'కమఠములారా! మీకెందు నెగ్గుచేయను. సుఖమున నుండుఁ'డని చెప్పి

వెడలిపోయెను. అంత కచ్ఛపావళి అతిసంతోషముతో నుండెను.

అట్లగుటఁ బరస్పరవశ్యులగు బంధువులు కమఠములవలె నాపదగడవఁగల్గుదురు. ఇఁకనైన నామాట లంగీకరించెదరేని వినుఁడు. కంఠమూలమునఁ గదిసియున్న ఈయురు లుడిచిపోవు నుపాయములేదు. కాని చావకుండఁగల ఉపాయము గలదు. దానికి మనలోమన కైకమత్య మత్యావసరము. అట్టి ఉపాయ మెట్లందురా? ఈజాలమునొడ్డిన వేటకాఁడు వేగుట తోడనే వచ్చును. వాఁడువచ్చునప్పటికి మనమందఱ మపగత ప్రాణులవలెఁ బడియుండవలెను. అట్లుంటిమేని మనలనురులఁ బాపి 'యివిచచ్చిన'వని కిరాతుఁడు మనలను జంపుటమాని వటముక్రింద దిగవైచును. వాఁడు చెట్టుదిగివచ్చు సమయమునం దెవ్వరమును బట్టువడక యెగిరిపోవుదము.'

మతిమంతుని ఉపదేశమునకు మరాళములు సంతసించినవి. 'ఇది లెస్సమతి'యని నిశ్చయించి యవి అపగతప్రాణులట్లు పడియుండెను. వేకువవేళ నిషాదుఁడు వచ్చెను. ఆవిహగయూథము పడియున్న చందమునుఁగాని యురులచే మెడలు బిగిసి పులుఁగులు మరణించినవనుచు వటమెక్కి యొకటొకటిగా వానిని క్రిందపడవైచెను. అట్లు వానినన్నిటిని ప్రోవుగఁ దిగవైచినవెనుక ఆహంసలెల్ల నిలువక సంభ్రమమున నెగిరిపోయెను. అప్పటికింకను మతిమంతుఁడు కడపటిశాఖయం దురులలోనుండెను. మతిమంతుని రాకఁదలంపక యతిభయమున నాయంచ లట్లుపోవుటచూచి బోయఁడు 'ముండపులుఁగులు నన్నుమోసపుచ్చినవి'యని యలిగి మిగిలియున్న ఆనాలస్వనుడాసి మెడనులిమి చంపివేసెను.

సూచితిరిగదా! మతిగలపిన మతిమంతుఁడు సితచ్ఛ దోత్కరముచేతఁ జెడినవిధము. మతియు, ధృతియులేని వెఱ్ఱి వారికి మతిగలపిన సుమతికిఁ బ్రమాదమువచ్చును. మతి మంతుఁ డావిధమున హతుఁడయ్యెను. మిగిలిన హంసలు దుఃఖాయతనములయ్యెను. ఇదియంతయు నొకనాఁటి రాత్రి కాకమునకుఁ దావొసఁగినఫలము. కావున, మందూకేశ్వరా! ఈసర్వము మనయావాసముఁ జేరెనేని మన కతిశయదుఃఖము కల్గును. దీనికి మననివాసమునకువచ్చు త్రోవ నెఱిఁగించు నుద్దే శము మానుము. అధికకరుణామతివై యితనికి నీ వుప కారముచేయఁ గడంగుచున్నావు. అట్లు చేయుటకు ముందు పాత్రాపాత్రతల నెంచిచూడుము. క్రూరులగువారు ప్రత్యు పకారము చేయఁజాలరు సరికదా మంచివారిపయి తప్పుల నారో పింతురు. పూర్వము కారండవచయమునకుఁ బ్రత్యుపకృతిఁ జేయక వానిపయి నింద మోపిన కాకులకథ నెఱుఁగవా? చెప్పెద వినుఁడు.

పురాతనకాలమునందు కోసలదేశమున ధారాసనుఁ డనురాజుండెను. నయధర్మపథములనువదలి ఆతఁడు ప్రజలు భయపడునట్లు చరింపఁదొడఁగెను. ఆ రాజుచేయు నెగ్గులు కారణముగ నాజనపదమునఁ గఱవుసంభవించెను. ఆరాష్ట్రమున నుండు కాకితండమెల్ల నాసమయమున నొకచోటఁ గూడుకొని "మునుపటివలె నిక్కడ ముంగిళ్లయందు నెందువులు గానరావు. ఎంగిలిమెతుకులైన జనులు చల్లుటలేదు. ఇచ్చటి జనులు పూర్వమువలె బలులొసంగుటలేదు. కావున నిచ్చటివెడ మాయపుటాసలనెల్ల వేగముగవిడిచి మఱియొకచోటికి కరిగి నేర్చినవిధమునఁ గడుపులు నిండించుకొనుట మంచిపని' యని

నిర్ణయించుకొనినవి. అట్లు నిశ్చయించి కాకులు తమ దేశమును విడిచి పొట్టకూటికై నెందేని చనుచుండెను. అప్పుడు త్రోవలో నొకచోట కాసారములోనున్న నీరుకాకులు వానిని చూచెను. చూచి జాతిత్వమాత్రనిబద్ధమగు బాంధవమున నా నీరుకాకులు కాకులనుచేరఁబోయి యద్దినరాత్రి యచ్చట నుండఁ బ్రార్థించెను. అప్పుడు వాయసము లచ్చట నిలిచెను. మొదట కాకులు కాసారమందలి తియ్యనీటిని గ్రోలినవి; పిమ్మట తటముననున్న ఇప్పగుచెట్ల నీడల విశ్రమించినవి; అప్పుడు వారిఖగములు ప్రోకలుగొట్టి తముముందఱఁబెట్టిన చేపలను తిని పేరాఁకలినంతయుఁ దీర్చికొన్నవి. అట్లు కాకు లద్దిన రాత్రముండి వేకువవేళ ప్రయాణమైనవి. అంతట నీరుకాకులు వచ్చి 'మీ రేపని కేదేశమునకుఁ బోయెద'రని ప్రశ్నించినవి. దానికిఁ జిరంజీవములు 'మేము వసించు దేశమునఁ గఱవుగల్గినది. అగుటచే మాకాహారము లేకపోయినది. కావున మేము పండిన భూములను వెదకికొనుచు నితరదేశములకుఁ బోవుచున్నా'మని బదులుచెప్పినవి. అందుమీఁదఁ గారండవము 'లట్లయినచో నెక్కడికో పోనేల? ఇచ్చట నిలువుఁడు. ఈకొల నెన్నడు నింకదు. ఇందు జలచరములు చాలఁగల'వని చెప్పెను. ఆమాటలకు వాయసములు 'మే మీఁదువెరవు లేనివారము. నీటిలో నీఁదక యామిషములులభింపవు. అగుటచే నిచ్చట మే మేవిధమున నుదరములఁ బోషించుకొనఁగలము?' మనెను. అందుమీఁద నీటిపక్షులు 'మే మావిధమెఱుఁగుదుము. మిమ్ముల మఱియొకచోటికిఁ బోనిచ్చుట మాకు ధర్మముకాదు. మీ రూరక కొలనిగట్టున నిలిచియుండుఁడు. వలసినపుడెల్ల వారిచరములఁ దృప్తికలుగ మీకుఁ బెట్టుచుందు'మన్నవి. సరే

యని కాకు లచ్చటనిలిచినవి. జలపక్షులు క్రొవ్వినచేఁపలను
బయటఁ బడవేయుచుండెను. వానిని మ్రింగి కాకులు సమీపమునం
దలి చల్లనిచెట్లనీడలఁ గ్రీడించుచుండెను. మిక్కిలి బలిసి యాకా
కులు చాలప్రొద్దులు సంతోషమున నచ్చటనే యుండిపోయెను.
కొంతకాలమునకుఁ దమదేశమున దుర్భిక్షము తొలఁగుట
తెలిసికొని తిరిగిపోవ నిశ్చయించి యాకాకులు తమలోఁదా
మిట్లు విచారింపఁదొడఁగెను. 'ఈ కారండవములు మన కుప
కారము చేసినవి. ఇప్పుడు మనము వీనిఁగన్నుమొఱఁగి పోవల
యును. లేనిచో వీనికిఁ బ్రత్యుపకారము చేయుశక్తి మనకేది?'
ఆపలుకులు విని యందుఁ గొన్నికాకు లిట్లు చెప్పినవి. 'వీనికిఁ
జెప్పకుండఁ బోయినచో దొంగతన మనిపించుకొనును. చెప్పి
ప్రీతితో వీరనుపఁగాఁ బోయితిమేని వీరికి ముందెప్పుడైన
ప్రత్యుపకారము చేయవలసియుండును. ఇవిచేసిన ఉపకారము
నకు మన మప్పుపడిపోనేల? వీనిమీఁద నేదైననొక తప్పు
నారోపించుదము. దానితో నదియెల్లఁ జెడును.' అప్పుడు 'వీరి
మీఁద మోపుటకు దోసమొకటికలదా?'యని వెదకి కొఱఁతలు
గనుఁగొని కాకులన్నియును జలపక్షులకడకుఁజని వానినుద్దే
శించి యిట్లుపలికెను. 'మా నామము చిరజీవము. మా
కొకటి లెక్క కాదు. ఇష్టమువచ్చినచోటి కరుగక యిచ్చట
మీమూలమున నాఁగితిమి. ఆఁగి మీచేఁ బరిభవములఁ బొంది
తిమి. నెలమీఁద పదిప్రొద్దులు నిల్చినమాత్రముననే మీరు
మా కెల్లప్పుడును ఎంగిలిపెట్టినారు. మీరు కిల్బిషవర్తనులు.
ఎట్టివారికైనను లోకమునం దక్కఱలుకలుగకుండవు. ఓడల
బండ్లును, బండ్ల నోడలును వచ్చుననుట మీరు వినలేదా? ఇట్లు
మీకుఁ జేయఁదగునా? అదియునుగాక మీరు పుచ్ఛములను

మాటిమాటికి మాకుఁజూపుచు నస్వేచ్ఛలయి నీటఁగ్రుంకెదు
తుచ్ఛులు. అట్టిమిమ్ము మే మేమని తిట్టఁజాలుదుము? మాలో
సగముమంది వ్రతనియమము గలవారు. సరసిఁ గ్రుంకుచు
మీరు పుచ్ఛములఁ జూపఁగాఁ జూచుచుఁ గోఁతలు చుట్టుకొనిన
నట్టివా రిచ్చట చేరినది మొదలు ఆహారము ముట్టకున్నారు. మీ
కోఱగాములు సర్వము మీ కుండునుగాక!' అనిపలికి కాకులు
మిన్ను కలఁగిపోవునట్లు కావుకావని యఱచుచుఁ బూర్వదేశ
మునుబట్టిపోయెను. కాఁబట్టి ఉత్తముఁడు తనదయ పెంపున
నుపకారము చేయఁగాఁ గిల్బిషుఁడు ప్రత్యుపకారము వెద
కఁడు. సరికదా పై పెచ్చు అపకారముచేయును. ఆపద
కల్గించును.''

కృష్ణరూపి చెప్పఁగాఁ గప్పలరా జిదియంతయు వినెను. అయిన నారాజు పాముఎడల స్నేహమువీడలేదు. అప్పుడు వృకోదరుఁడను ప్రధాని తనపతి కిట్లు చెప్పెను.

''తులువ కాపద మూడినప్పుడు చెలిమై తగువాఁడు చక్కఁజేయుట యెంతయుఁ బులికి నొకగ్రామానిపోటుఁ బులుఁ గుపకారము చేసినవిధమున నగును. ఆకథ యెట్లందురా? వినుఁడు.

తొల్లి యొకకాంతారమున శార్దూల మొకటియుండెను. అది యొకముసలిమృగమును జంపి దానినెత్తురుఁగ్రోలి యాఁకలిబాధ నలయించుకొనుటకు దానిమాంసమును భక్షించెను. అప్పుడు పెద్దపులికోఱలసందునఁ జిన్న యెముకలు గ్రుచ్చుకొనెను. పులికి నెముకలు గ్రుచ్చుకొనినబాధ దిన క్రమమున హెచ్చెను. భుక్తిఁగొనఁజేరక యాపులి నోరు తెఱచి కొని చొంగకార్చుకొనుచుఁబడియుండెను. పులినిజూచి చెంత

చెట్టుపయినున్న ద్రుమకుట్టవిహంగము 'వ్యాఘ్రరాజా! ఆర్తిలకూసెదవు? నోరొకమూయును మూయవేమి? కాళ్ళఁ జుట్టినతీఁగెలనైనను తెంపలేకున్నావు. నీ కీవిధమైన యాపద కల్గుటకుఁగారణమేమి? అక్కటా! ప్రతికూలుఁడయినచో విధాత యెంతటివారినైన నిడుమలఁ బెట్టునుగదా!' అనియెను. అందుమీఁద వ్యాఘ్రము తనబాధలకుఁగల కారణమంతయుఁ జెప్పెను. విహంగ మప్పు డుదారబుద్ధితో 'నుపాయముచేత నేను నీ కీబాధఁదొలఁగించెదను. నా కేమిమేలొనరించెద' వనియడిగెను. అప్పుడు పెద్దపులి 'నెచ్చెలీ! నీవు నా కుపకారముచేసి యీబాధ బోఁగొట్టెదవేని యొక్క మేలని యితి చెప్పనేల? నిన్ను నాయాప్తసఖునిఁగఁ జేకొని యేవనమున నేజంతువును జంపినను దానిమాంసము సగము నీకిత్తును. మఱియు నీ వేహితముఁగోరినను చేయుదు'నని నమ్మపలికెను. 'అట్లయిన నీవదనము విప్పఁగఁదెఱవు'మని నియమించి విహగ మతినిపుణతతో, సాహసముతో దానినోటిలోఁజొచ్చి దంష్ట్రికలు పాదమునఁ గొనితన్ని సంధియున్నయెముకల ముక్కున నూఁదిపట్టి కదిలించి పెఱికి యధిక వేగమున వెడలివచ్చి చెట్టుకొమ్మనెక్కి యెముకల నుమిసెను. అప్పుడు పులినోటిబాధతగ్గి దినక్రమమునఁ బుండాఱి మానిపోయెను. అంతట నొకనాఁ డాపులి యొక మహామృగమునువధించి దానిమాంసమును తినుచుండెను. అప్పు డాచోటకి ద్రుమకుట్టమువచ్చి కట్టెదుట నిలిచి 'మృగోత్తమ! నాభుక్తికిఁ దగుమాఁసము వెట్టుము. నాతో మృదువచనములు పలుకు'మనెను. అందుమీఁద శార్దూల మిట్లుపలికెను. 'నీ వెవ్వఁడవు? నీకు నేను మాంసమేల లంచముఁ బెట్టవలయును? నీవు పక్షివి. నేను మృగపతిని. నావచన

ములఁ బ్రయోజనము నీ కేమి?' అందుకు ద్రుమకుట్టము 'శార్దూలపతీ! నన్నెఱుఁగవా? నీవదనకుహరములోఁ జొచ్చి దాడలసందున నాటిన శల్యములఁ బెఱికిన స్నేహితుఁడను. అట్టి నన్ను నీకు మఱవఁ జనునా?' యని మాఱుపలికెను. ఆమాట లకుఁ బులి నవ్వుచు ద్రుమకుట్టముతోఁ 'గాయ లుడివోయినట్టి వృక్షము, పాఁడియెల్లఁగడచిన ధేనువు, ఏఱుగడపినవాఁడు, కార్యము తీర్చినవాఁడును అప్పుడేకాని పిదప నాదరణీయులు గారు. అది యెట్లందువా? విపినాంతరములందు బహుసత్వ ములఁ జంపుచుఁ గృపయొక్కింతయు లేనివాఁడను నేను. అట్టి నావదనముఁ గ్రీడారతిఁజొచ్చితివి. అప్పుడు నిన్ను కోపమున మ్రింగినచో నీవు బయటికి రాఁగల్గియుందువా? మ్రింగక విడిచి పుచ్చుటయే నీ కుపకారము. ఇంతకంటె ఉపకార మేమున్నదో యూహించుకొను'మని ప్రలాపించెను. అప్పటి కేమియుఁ జేయునదిలేక ద్రుమకుట్టము తొలఁగిపోయి యాత్మగతమున 'భూమిమీఁది ధూళి పాదాహతమై యెగసి తొక్కినవానితల వట్టుచున్నది. ఒకనిచే నలంపఁబడి వానిఁదొడరఁదలఁకినవాఁ డట్టిధూళికంటె తక్కువయగు'నని తలపోసెను. పులి కేదైన కీడొనరింపఁ దెంపుఁజేసికొని యాపులుఁగు సమయముకొఱకు వేచియుండెను. ఒకప్పుడు శార్దూలము కన్నుమొఱఁగియుం డెను. అదికనిపెట్టి విహంగము పులికన్నుఁబొడిచి నిండిన సంతోషముతోఁ జెట్టుకొమ్మనెక్కి హాస్యప్రౌఢవాక్యముల నిట్లనియెను. 'మృగమా! వినుము. పోయినకంటికై విచా రింపకుము. రెండుకన్నులును బొడవకుండినందుకు సంతోషిం పుము. ఒకకన్ను మిగిలియుండుటకు సంతసముఁజెందుట నీ కుచితము.' ఇట్లుపలికి బుఱుఁగు నిజేచ్ఛఁజనియెను. పులికిఁ

గంటిబాధ యెక్కువయ్యెను. అది యావన మదురునట్లు వాపోవఁదొడఁగెను. తుదకుఁ గృతఘ్నత్వమునఁ జనిపోయెను. కావున మహాబలులైనను ధీమంతుల కెగ్గులుచేసి బలహీనులై కీడు పొందుదురు. మానిపోటుఁబులుఁగుపు బరిభవించి తొల్లి పులి చెడినవిధముఁ జూచితిరిగదా!”

వృకోదరుఁ డిట్లు చెప్పెను. అప్పు డా భేకముల నుద్దేశించి భయదర్శక మీవిధముగాఁ బలికెను.

“నే నొకపుడిసెఁడు త్రాగినమాత్రమున నీ నూతిజల మంతయుఁ దఱిగిపోవునా? నీళ్ళమాత్రమునకై నాతో నేలఁ బెనఁగులాడెదరు? ఇంతనిష్ఠురలోభము పూనరాదు. తగు మాత్రమే కాని లోభగుణము మిక్కిలికూడదు. అతిలోభ గుణమువలననేగదా మృగధూర్తుం డొకఁడు పూర్వము మృతినొందినాఁడు? ఆకథ యెట్లందురా? వినుఁడు.

విజపుర ప్రాంతమందలి విపినాంతరమునకు బోయఁ డొకఁడు వేఁటకుఁ బోయెను. అచట వాఁడు వనహస్తి నొక దానిని గనుఁగొని పుట్టనెక్కి బాణమున దానితొండము ద్రుంచి చంపివేసెను. వాఁ డెక్కియున్నపుట్టలోనుండి వెలువడి యింతలో పామొకటి వానిని గఱచెను. అంత వాఁడు మొలనున్న వాఁడికుఠారముతో నానాగమును వధియించెను. పిమ్మట వాఁడును నేలఁగూలి చనిపోయెను. అచ్చటికి నక్కయొక్కటి వచ్చెను. పడియున్న జంతువులనుజూచి సంతోషించి యిట్లు తలపోసెను. ‘నాకీ యేనుఁగుమాంస మాఱునెలలకు సరి పోవును. మానవకళేబరము సప్తవాసరములు వచ్చును. సర్ప మొకదినమునకుఁ జాలును. నేఁటి కివి యుంగిలిచేయుట యెంతు లకు? బోయఁడు వింటనిడిన నరము లీపూఁటఁ గడపఁజాలవా?

చాలకపోయినను ఒకనాఁటితోఁ బ్రాణముపోదు.’ ఈ విధ మునఁ దలఁచి యానక్క యెక్కువెట్టియున్న ధనువుఁ గదిసి దానికొమ్మును దనగొంతుంగ్రోలున మోచియుండఁగా గొవ యమునరములు కొఱకఁదొడఁగెను. నరము లొక్కటొకటి కొఱకఁగా గొనమెల్లఁద్రెవ్వి ధనువుకొమ్మొగసి నక్కకంఠము నాటి పెడతలకుదూసివచ్చినది. అప్పుడు నక్క కూసికొనుచుఁ నేలఁగూలి మరణించినది. అట్లగుటవలన లోభ మెంతమాత్రము పనికిరాదు.”

పాముచెప్పిన యీపలుకు లాక్షేపించుచు అసాదియను కప్ప యిట్లు వచియించెను.

“లోభము కూడదేని యతివ్యయశీలత్వము మాత్రమే మేలైనదా ? దుర్బుద్ధులు పెద్దఱికముకొఱకుఁ దమ కలిమికి మించిన వ్యయములు చేసి చెడుదురు. దురైశ్వర్యమహిమవలన నారికేళబకమను పులుఁగు పొలిసినకథ మీరు వినలేదా ? చెప్పెదను. వినుఁడు.

విస్తారజలములేని యొక మడుఁగుద్రేవ నున్నతమగు నారికేళవృక్ష మొకటి గలదు. మడుఁగునందలి చేపలఁబట్టితినుచుఁ జీకుకొక్కెర యొకటి యా కొబ్బరిచెట్టుమీఁద వసియించు చుండెను. అది యొకనాఁ డంబరమునఁ బదివేలు బకాదివారి పక్షులు పోవుట చూచెను. ‘అల్లదే! నాకోలముసాములు పోవు చున్నా’రని తలఁచి యది వాని కడ్డముగఁబాఱి యెక్కుడు ప్రియములుకావించి ‘మీ రూరకపోవుటతగదు. ఆ కనిపించు భూజమున నాయావాసము. బాంధవాభిరంజనమగునట్లు మీ రచ్చటికి రావలయును. అచ్చటఁ గొలనొక్కటిగలదు. ప్రశస్త రుచులతో నక్కడ నాహారములు, జలములు లభ్యములగును.

ఇఁక మాటలెందుకు? కులమువారెల్లఁ బొగడునట్లు విందు
చేయఁగోరెద'నని ప్రార్థించెను. ఆ ప్రార్థనావాక్యములకు బుద్ధి
మంతములగు విహంగములుకొన్ని 'మమ్మేఁపవలదు. నీవు
గుణవంతుఁడవు. స్వకులమువారిమీఁద నీకుఁగలిగిన భక్తి
ప్రియములకు సంతోషమైనది' యన్నవి. అయినను నాబ
కము వారిమాటలు వినలేదు; తనపట్టు విడలేదు. అప్పుడాపక్షు
లలోఁగొన్ని దానితో 'నీయూథ మనంతము. ఇందఱు నిలుచు
టకు నీయింటఁజోటులేదు. నీవుచెప్పిన ఆతోయములు, ఆహార
ములు మాకుఁ దెలియనివికావు. అవి యల్పమాత్రములు.
ఆ మడఁగునందలి చేఁపలు నీ కొక్కనికిమాత్రము వర్షములు
కురియువఱకు సరిపోవును, కావున మమ్ము పోనిమ్మ'ని పలికి
నవి. ఆమాటలకుఁ గొక్కెర 'బంధువులదయవలన నన్నియుఁ
గలుగును. కావున మీరు వచ్చితీరవలయును. అట్లురాక
నన్నుఁ ద్రోచిపోయినచో మీ రెల్లఁ గనుఁగొనుచుండ నిప్పుడే
ప్రాణములు విడుతు'నని మూర్ఛించెను. అప్పుడాపత్రికోటి
'ఇతఁ డట్లనుచుండఁగాఁ గడచిపోయి మనము వృథాపాపము
పొందనేల?' యని కొక్కెర యింటికిఁబోయెను. అట్లుపోయి
మడుఁగంతయు వెరఁజాడి మందుకైన మత్స్యము లేకుండ
మ్రింగి రాత్రియుండుట కిక్కడ చోటుచాలదని ఆ విహగము
లెగిరిపోయినవి. పిమ్మటఁ గొక్కెర కొన్నిప్రొద్దులు పేరాఁ
కట మ్రగ్గి మరణించినది. కావున వ్యవసాయముకాలఁది, దేశ
విధము, కాలము, పూర్వసంచితమగు సొమ్ము విచారింపక
వ్యయముచేయు నతఁడు దీనతఁజెందును. ఆయవ్యయముల
క్రమము కమండలువునుజూచి తెలిసికొనవలయును. కమండ
లువు జలమును గ్రహించునపుడు పెద్దవాతను గైకొనును; వెడ

లించునప్పుడు సన్నముగ వెలార్చును. అట్లే యాయము హెచ్చుగాను, వ్యయము తక్కువగాను ఉండవలెను."

అసారిచెప్పిన ఈమాటలకుఁ బ్రతిగా భయదర్శక యిా విధమున వాక్రుచ్చినది.

"ఉచితలోభము కర్తవ్యము. అతిలోభ మొప్పదు. అతిలుబ్ధతవలన ధనగుప్తుఁడను వణిజుని విత్తమంతయు భూపతిపాలయిన కథను మీరు వినలేదా? చెప్పెదను. అవధరింపుఁడు.

భూమికి భూషణమయిన ఉజ్జయినీ నగరమున ధనగుప్తుఁడు, వర్ధమానుఁడునను నిరువురు వర్తకులుండిరి. వారధిక ధనప్రపూర్ణులు; స్నేహితులు. జీనపుదీవియం దినుమును, బంగారియు సరికిసరియని తెలిసికొని యచ్చట వర్తకముచేయఁ దలఁచి సెట్టులిద్దఱును చెఱియొకనావయు నాయిత్తముచేసి వాని నినుముతో నింపి పయనమయిరి. ఫేనతరంగభంగురగభీర పయోనిధిలో నావ మీఁద నరుగుచుండఁగా వర్ధమానుని మహాజ్వరము తాఁకెను. అప్పుడు ధనగుప్తుఁడు వానితో 'నెచ్చెలీ! శరనిధియాత్రకు, నచ్చటి బేరసారములకు నేనొక్కఁడనే చాలుదును. నీవు తిరిగిపొమ్ము. నీబేహారము నేను సాగించి నీధనము నీకిత్తును. స్నేహితుఁడనయియుండి మఱియొక విధముగాఁ జేయుదునా? కావున మఱలిపొమ్ము. నీవు గల్గిన సమస్తశుభములు కల్గు'నని చెప్పెను. వర్ధమానుఁ డింటికి వచ్చెను. ధనగుప్తుఁడు జీనపుదీవికిఁబోయి యినుమునకు రెండెత్తుల చొప్పున కనకము గైకొనెను. అట్లుచేకొనిన సువర్ణమును నాలుగు ఓడలకెత్తించి యానందగర్వమున నింటికి వచ్చుచుండెను. నావలు సముద్రమధ్యమునకు వచ్చెను. అప్పుడు వాఁ డిట్లు తలపోసెను. 'వర్ధమానుని ఒకయోడ యినుమునకు రెండు

యోడల కనకము నే నెట్లియ్యఁగలను ? ఈ సొమ్ములో నాత నికి వీసమైన నీయఁజాలను ? వెనుక వర్థమానుఁ డాయాసపడి కూర్చిన తనసొమ్ములో నాకు సగభాగ మిచ్చియున్నాఁడా ? నే నిపు డేల నాతని కీయవలయును ? ఎక్కడి చెలితనము ? నా కాతఁ డెక్కడిచుట్టము ? ఈ సముద్రములో నిప్పుడు మునిఁగిన ఆతనిసఖ్యము నన్ను చక్కఁబెట్టఁగల్గునా ?' ఈ విధముగాఁ దలఁచి ధనగుప్తుఁడు వర్థమానుని తిరుపువారల నెల్లర నీటిలోఁ బలఁద్రోయించి చంపించెను. పిమ్మట దగ్గఱిరేవున దిగి పురముఁ జేరి యచ్చట నాలుగుమోడల సువర్ణమును బాఁతిపెట్టించి ఆత్మ నివాసమునకుఁబోయి దరిద్రతాభర మచ్చుపడున ట్లుండెను. అప్పుడు వర్థమానుఁడు వచ్చి యన్యోన్యసమాగమోచితము [illegible] 'నేను బీదవాఁడనైతిని. నకుఁ [illegible] పాట్లుగల్గినవి. ఉన్నసొమ్మంతయుఁ బోఁగొట్టుకొంటిని. నీవు తిరిగి యెప్పుడువత్తువాయని కనిపెట్టుకొనియున్నాను. తుదకు నీవు వచ్చినావు. నీ వేవిధమున లాభముకూర్చినావు ? ఎట్లు తిరిగివచ్చితి' వని ప్రశ్నించెను. సుకృతఘ్నుస్మరుఁడయిన ధనగుప్తుఁ డందుమీఁద లేనిదుఃఖము నటించుచు నిట్లువచించెను.' అన్నా! యేమని చెప్పుదును. దైవమంతయుఁ బాడుచేసినాఁడు. మున్నీ రెల్లనుదాఁటి అమ్మొదుపురముఁజేరి యందొక యింటిలో నినుమంతయుఁ బెట్టించితిని. చెప్పిన నమ్మవు. వినుట కసత్యముగా నుండును. ఆ లోహమునంతయు నెలుకలు మూఁడు రాత్రు లలోఁ దినివేసినవి. కొండంత యినుములోపల—ఏమిచోద్య మోగాని—పాతికయెత్తయిన నుండనీయక ముండయెలుకలు తినివేసినవి. అప్పు డక్కడనుండుటకే నాకు సిగ్గయినది. కావున వెంటనే సముద్రముదాఁటి వచ్చితిని. తెప్పుళ్ళ వలన

సీవారు చనిపోయినారు. అచట రోగములు విస్తారము. తిరిగి
వచ్చుసమయమునఁ జెప్పరాని బాధలుగలిగి చాల నలజడిఁ
బొంచితిని. మిక్కిలి పాపాత్ముఁడను. స్నేహితుఁడవగు నిన్నుఁ
జాలఁ జెఱచితిని.' ఇట్లు వచించి ధనగుప్తుఁడు వర్ధమానుని
సాగనంపెను. 'తప్పక యిది యసత్యము. వంచించి నాధనము
నీతఁ డపహరించినాఁ'డని తెలిసికొని వర్ధమానుఁ డచట
నేమియుఁబలుకక నిజగృహమునకుఁబోయి యిట్లు తలపోసెను.
'నమ్మనే కూడదు. ఒకవేళ మొదటనమ్మి యితరుల నాత్మ
కార్యమునకుఁబంపిన, నందు వారు మోసముచేసినచో గుఱు
తెఱుఁగక వేగిరపడుటెల్ల వెఱ్ఱితనము. సొమ్ములయెడ నెవ్వా
రిని నమ్మఁదగదు. నమ్మకుండిన భూమియందు జరగదు.
సొమ్ముగలవారికి నర్థుల నమ్మగాఁ గీడైనచో నేమియునఁ
గలము? తనదేహమే నిత్యముకానప్పుడు తనధనముసంగతి
చెప్పుటయెందులకు? తాను, తనధనమును దైవధనములు.
కావున నాధన మాదైవముచేసినట్లెల్ల నగుచుండును. చెలి
తనమునఁ దన్నుఁజెఱచిన తులువను ప్రియములుప్రకటించుచుఁ,
బలుకులతీపులఁ జూపుచుఁ జెలిమైవర్తించి చెఱుపవలయును.'
ఇట్లు నిశ్చయించి వర్ధమానుఁడు ధనగుప్తునియెడ దట్టపు
నెయ్యము ప్రకటించుచు నొకనాఁ డాతనికుమారుని లాలన
చేయుచుఁ దనయింటికి నెత్తుకొనివచ్చెను. వర్ధమానుఁ డా
బాలుని నెవ్వరు నెఱుంగఁజాలనిచోట దాఁచెను. కొంతసేపటికి
ధనగుప్తునివారువచ్చి 'బాలుని దెండ'ని యడిగిరి. తీవ్రదుఃఖ
మగ్నుఁడయినట్లు నటించుచు వర్ధమానుఁడు 'అయ్యో! యేమి
చెప్పుదును? నాచేతిలోనుండఁగా గ్రద్దయొకటి బిడ్డను తన్ని
కొనిపోయినది. ఈసంగతి సెట్టికిఁజెప్పుటకు నాకు మొగము

చెల్లకున్నది' యని పల్కెను. ఆమాటలు వారు ధనగుప్తునకుఁ
దెలిపిరి. అందుమీఁద నాతఁడు దెబ్బతిన్న పులివలె మండిపడి
'లోకములో నెప్పుడైన నిట్టిసంగతులు వినియున్నారా?'
యనుచు రాజువద్దకుఁబోయి ఫిర్యాదుచేసెను. అప్పుడు రాజు
వర్ధమానుని రప్పించి 'ఇంత నెఱవాదివి. ఇట్లు బొంకఁదగునా?
బాలకుని గ్రద్దయెత్తుకొనిపోయెననుట యే యుగమునందైన
నే దేశమునందైనఁ గలదా?' యని ప్రశ్నించెను. అప్పుడు మడి
చేతులు కట్టుకొని వర్ధమానుఁడు రాజున కిట్లని విన్నవించెను.
'దేవరవారిందునిజము పరికించితిరి. సర్వము తమరు భావ
ములో నెఱుఁగఁదగును. రెండునావల యినుమునంతయు నెలు
కలుతినుట భూలోకమున నెచ్చటనైనఁగలదా? నావాఁడు నా
ధన మపహరించి సెట్టి యిట్లుచెప్పినాఁడు.' ఆ విన్నపమాలించి
జనపతి 'ఇది యెట్లు?' ని ధనగుప్తునిఁజూచి యడిగెను. అప్పు
డాతఁడు 'అధిపా! ఈతనిదొకటియు నాదొకటియు రెండు
యోడలయినుముఁ దీసికొని చీనాద్వీపమునకుఁ బోయితిని. కాని
పోయిన యినుమంతయు నితని దురదృష్టవశమున నెలుకకాం
డము భక్షించెను. కాని యతఁడా యోడెఁడినుమునకు నోడెఁడు
బంగార మపహరించితినని కల్లలాడుచున్నాఁ' డని చెప్పెను.
వర్ధమానుఁ డప్పు డా రాజునుద్దేశించి 'రాజా! ఆమాటల
నవధరింపుము. రెండుయోడల ఇనుము మూషికకాండము
భక్షించెననుమాట కల్లగాకుండెనేని గ్రద్ద పిల్లవానిని గొని
పోవుటయుఁ గల్లకా' దనెను. ఆ మాటలకు రాజునవ్వి సచివా
వళిఁ గనుఁగొని 'యంతటి మేటిబొంకున కిది సరిపోలు' ననెను.
పిమ్మట ధనగుప్తునిఁజూచి 'యిట్టిమాట లిఁక సాగవు. ఎలుక
లినుముతినునా? ఇంతటి నూనిసివి. ఇట్లు పలికిన విని ప్రజలు

నవ్వరా? అతనివిత్తము నిపుడయిన నాతని కిమ్మని యాజ్ఞాపించెను. అప్పుడు ధనగుప్తుఁ 'డితఁడిచ్చిన యినుమున కినుమే యిత్తును గాని కనకమేలా యిత్తు?' ననెను. ఆమాటలకు మండిపడి జనపతి తనయొద్దఁ జనవుగలలెంకలతో 'ఓరీ! కోమటి ముక్కున నీరెత్తుఁడు. మేము కోపింపకున్న వీఁ డడ్డులేక నోరికివచ్చినట్లు వదరు లఱచుచున్నాఁ'డని చెప్పెను. లెంకలంతఁ ద్రోసికొనుచుఁజనఁగా ధనగుప్తుఁడు 'అయ్యా! భ్రాంతిని. కనక మొకయోడెఁడుమాత్రముకలదు. మీయాన. నిజముగా నంతకన్న నెక్కువలేదు. అతనిఅర్థ మాతని కిప్పింపుఁ'డని పలికెను. ఈతనిమాట నిజముకాదని రాజు వచించెను. భటులింకను ధనగుప్తుని బాధపెట్టిరి. అప్పుడు ధనగుప్తుఁ డపుడునవపు రెంపుంతలు పసిఁడికల్గుటయుఁ, జెలికాని భటులను తాను చంపించుటయుఁ జెప్పి నాలుగు యోడల ధనమును, తాను బాఁతిపెట్టినస్థలమును వారికిఁజూపెను. అందుమీఁద రాజు నవ్వి యాధనమంతయుఁ ద్రవ్వి తెప్పించి వర్ధమానునకొసఁగెను. వర్ధమానుఁడు తనయర్ధభాగము తన్నుఁజేరినఁ జాలునని నిశ్చయించెను. మిగిలిన సగభాగమును, ధనగుప్తుని యాస్తియంత రాజుగ్రహించి యాతనిని దేశమునుండి వెడలనడిపెను. అది మొదలు భార్య, పిల్లలు వెంటరాఁ దిరిపెమెత్తికొనుచు ధనగుప్తుఁ డిడుమలఁబడియెను. ఓడెఁడినుమునకు రెండోడల కనకము కలిగినప్పుడు ధనగుప్తుఁ డల్పమేధత్వమున వలనుగలిగి మెలఁగ నేరఁడయ్యెను, లోభగుణమున ధనగుప్తుని ప్రాభవ మావిధమున నడఁగిపోయెను. నామాటలు వినుఁడు. మీ లోభమును మానుఁడు. నీళ్ళకై భూమిమీఁద నిట్టిలోభము వహింపరాదు."

ఇట్లుపలికి భయదర్శకము మునుపటివలె మండూక వల్లభుని స్తుతియించెను. తరువాత నిట్లువచించెను. "చిన్నతనమునుండియు నేను జీవహింసఁ జేయనొల్లకుంటిని. అది యొక పెద్దవ్రతమని యిప్పుడు తడవనేల? జీవహింసను జేయువారి గాలిసోఁకినచోఁ గల్మషముగఁ దలఁతును." ఆ పలుకులు విని అభిజ్ఞుఁడను ప్లవంగము తనపతి కిట్లనియెను. 'అతినిష్ఠ, అనాచారము, అతిశౌచము, అశౌచము, అతినింద, అతిస్తుతి అనునివి ధూర్తులవిధములు. అత్యాచారపుమాటలు, అత్యంత స్తుతులు నిజములుకావు. ప్రత్యక్షక్రూరమయిన పాముపచనము లేలనమ్మెదవు? దానిసాంగత్య మేలకోరెదవు? నీవీనుల నిపుడు మావాక్యములుచొరవు. తగినవారి నీతివచనముల నాదరింపనివారలపయి నైనను వారు డఁ గోపింపరు. ఇది యెంతయు నిజము.' ఇట్లుపలికి అభిజ్ఞుఁడు మౌనియయ్యెను. తక్కినవారుకూడ నూరకుండిరి. అప్పుడు పాము కప్పలరాజుని బొగడివర్ణించెను. ఆతనికి మేనుపొంగెను. తత్క్షణమే కప్పలరాజు పామునకు లోనికివచ్చుటకుఁ దెరు వొసఁగించెను. ఉరగ మంతటఁ గూపమునఁ బ్రవేశించి, నీళ్ళుగ్రోలి, చిఱుకప్పల నెఱగొనుచు బలియుచుండెను. క్రమముగా నా పాము భయదాకారతఁ బేర్చి దర్దురముల భక్షించుచుండెను. నానాఁటికిఁ గప్పలు లయమొందుచుండెను. మండూకసేన దశాంశశేషమయ్యెను. ఇదిచూచి చుట్టుజేరి మంత్రులు, ప్రియులు తిట్టుచుండ వినుచు భేకాధినాథుండు చింతఁబొందుచుఁ బశ్చాత్తాప సంతప్తుఁడయి భుజంగముతో నిట్లనియెను. 'మండూకకులమునెల్ల మడియించితివి. మిత్రునివలె నుండి మా కిటుల కీడుచేయుట నీకుఁదగునా?' ఆమాటలకు భుజగము

నవ్వుచు 'నీప్రధానులందఱును గడుఁబాపకర్ములు. నిన్నును నన్నుఁ బొందనీయక వీరు నయవిహీనబుద్ధులయి కల్లలుప్రేలి నారు. కావున వీరిని బ్రతుకనీయరాదు. బ్రతుకనిచ్చితిమేని వీరు వక్రభాషలాడి నీకును, నాకును గలమైత్రి హరింతు'రని పలికి తన్ను మున్ను జేరనీయక యడ్డుపడిన రాజుమంత్రులనందఱు నాతనియెదుటనే భ్రమించివైచెను. కతిపయదినములలో రాజును దప్పమిగిలిన కప్పలన్నిఁటిని దినివైచెను. అప్పుడు తనవా రెల్లరు మరణింప నొంటరియై భీతస్వాంతుఁడయి కలుగులో దూరి మోమువ్రమ్ముదోఁప నున్న మండూకాధిపునిఁజేరి పాము యిట్లు పలికెను. 'నే నతిదాహమున నూతిదరిని కూర్చుంటిని. అయి నను రాజ్యమదమున నన్ను వేగముగా రప్పింపకుంటివి. ఈ జలముపట్టొక మహాజగముఁట! కప్పపురుగు లందఱి ప్రజలఁట! ఒకకప్ప వానికెల్లను రాజఁట! ఆహా! ఇట్టినగవు లెందైనఁ గలవా? నగరిలోఁజొచ్చి నీపెద్దఱికము లిపుడు నాకుఁజూపె దవా?' ఇట్లు సాహసముతోఁబలికి భయదర్శకము వాపోవు చున్న భేకాధినాథుని నాటోపముతోఁగఱచి చంపి భక్షించెను.

కావున బలవంతుఁడయిన శత్రువునకు దూరముగాఁ జనవలయును. కార్యముకొఱకయి వాఁడు కలయవచ్చినను జేర్పడి బుద్ధిమంతులు వానిని గలసికొనరాదు.'' అని యిట్లు సుమతి యెఱిఁగించినకథ విని సుకుమారికాముకరందికలు సంత సిల్లిరి. తమసఖిని చాలఁ గొనియాడిరి.

---

౬

# సుకుమారిక ప్రసంగము

అప్పుడు సుకుమారిక నెయ్యముతో నిట్లనియెను. "ఒక్కచోట మెలఁగెడి స్నేహమున మేఖలకు హితముచెప్ప ఉద్దేశ్యము నీ వెన్నడును బెట్టుకొనవలదు. అది హితోక్తిని దెలియనేరదు. అగుటచే దానిని చేకొనఁజాలదు. వివేకము లేని వారికి హితముపదేశించుటయును, వారితోఁ జెలిమిచేయుటయును నీతిపరులకుఁ దగదు. విహగము కపిసహవాసమునఁ బొందిన ఆపద మీరు వినలేదా ? ఆకథ చెప్పెదను. వినుఁడు.

ఒక యడవిలో నొకచెట్టుమీఁద నొకసూచీముఖము, నొక వానరము నెయ్యముగలిగి యుండెను. ఇట్లుండ నొక నాఁటిరాత్రి మిన్నెల్ల నీలమేఘచ్ఛన్నమై యొక పెద్దవాన గురిసెను. పిమ్మట నీదరగాలియు, సన్నపుఁజినుకులు నెడతెగక యుండెను. విపినచరములకు బాధ మెండయ్యెను. ముట్టినద్దిన మిడుఁగురుఁబురువు వెన్ను దీపముగాఁగ నాసమయమున గిజిగాఁడు తడయని తనగూటిలోఁ బ్రియదారతో సుఖముననుండెను. అట్లుండి యాపక్షి తనస్నేహితుఁడగు వానరము చలిచే వణఁకుచుండుటచూచెను. అందుల కది వగచి నీడద్వారమునకుఁ జనుదెంచి యతనితో నిట్లనిపలికినది. 'ఉడుగక యొక్కలే వరుసని వానకు వడఁకుచున్నావు. రాత్రి యుగమువలెనున్నది. ఎప్పుడు తెల్లవాఱును ? నీబాధ యెట్లుతొలఁగును ? చూచుచు నెట్లూరకుందును ? నిన్ను రమ్మనుటకు నాగూటిలోఁ జోటు

లేదు. నాయిల్లు మిక్కిలిసన్నము. ఓ కపివర ! పెక్కుమాట
లాడెడిదేమి ? ఇట్టి పక్షిజన్మము నొందినపుడే నా పౌరుష
మడఁగిపోయినది. తనగృహమున స్నేహితులెల్లరు నభీష్టవస్తువు
లన్నియుఁబొంది మెచ్చికహెచ్చునట్లుగాఁ జరింపఁ జేయలేక
పోయినందులకు సజ్జనుఁడు వెచ్చనియూర్పు నించికొని, విన్న
దనమునుబొంది విచారించును. అట్టివిచార మాతనికి మఱి
యెట్టిదుర్దశచేతను గల్గదు. సుజనుఁడు భూమిమీఁదఁ దనవారి
కయిన యాపదలనెఱుఁగక యుండఁజాలఁడు ; ఎఱిఁగి యూర
కుండఁజాలఁడు ; చూడకుండ నుండలేఁడు ; చూచి సహింప
లేఁడు.' ఇట్లు తగుమాటలాడి పక్షి చెలికానిస్థితికి మిక్కిలి
విచారించినది. మఱియు నిట్లుపలికినది. 'కాలుసేతులు లేని
వాఁడవు గావు. ఉండఁదగిన యాలయము మున్ను జేసికొనని
పాపమున నీయట్టివాఁ డీనడిరాత్రి నిట్టిపాట్లు పడవలసివచ్చి
నది.' పక్షి చెప్పిన యీహితవచనములు చేకొనఁజాలక వెం
గలికోఁతి 'వీఁ డిరవున భార్యయుఁ దాను నుండి న న్నొక
లుబ్ధునిఁగాఁదలఁచి ప్రేలఁదొడఁగినాఁడు. ఇట్టికుటిలుఁడు మాఱి
యొకఁడుగలఁడా ? తనకఁట ! ఇల్లున్నదఁట ! తాను దొర
యఁట ! నాకఁట ? ఇల్లులేదఁట ! స్నేహమున నీపులుఁగు
గడుఁగ్రొవ్వియున్నది. దీని మద మడఁచెద' ననుచుఁ బక్షి
గూడుగలచెట్టుకొమ్మ పెళ్ళునవిఱిచి చేరువనున్న పల్వలోదక
మునఁ బడవైచెను. అప్పు డాపక్షి నీళ్ళంబడి తడిసిన ఱెక్క
లతో భయమునఁ గూయుచున్న ప్రాణేశ్వరి నుడిపి తెచ్చుకొని
మఱియొకచోటికిఁ గొంపోయి సుఖముగానుండెను.

కావున వివేకహీనులద్రోవను బోరాదు. బుద్ధిమంతుల
కేని వారితోడి చెలిమి యేవిధముననైన నాపదగల్గింపక

మానవు. ఉపాయముచేత నేదయినఁజేయ వేచియుండుట, తప్పులను బురిగొలుపుట, మర్మాంతరపరిహాసము చేయుట— ఇవి దుష్టసఖుల గుణములు.'' అని సుకుమారిక యెఱిఁగించిన కథ విని మిగిలిన సఖులిరువురు నామెను మిక్కిలి గొనియాడిరి.

---

## ౭
# మ క ర ం ది క వ చ న ము

అప్పుడు మకరందిక యిట్లనియెను, ''అరసిచూచితి మేని కుజనులు చెలిమియొనర్చినఁ గుమ్మరిపురుగుల విధమున నుండును. నీతిపరులు మిత్రులకు సొమ్మిత్తురు. అవసరమైనచోఁ దమప్రాణములఁగూడ నర్పింతురు. బుద్ధిమాలిన దగుటచే నొక కపి దన్నకు హితుఁడైనను భూపాలునొకని జంపెను. వివేకియగు టచే నొకదొంగ శత్రుఁడయినను విప్రునొకని గాచెను. విమతి నెయ్యముకంటె సుమతిపగ మేలు. ఆకథ యెట్లందురా? చెప్పెదను. వినుఁడు.

మందరపురియం దొక రాజకుమారుఁడు గలఁడు. ఆతడు కిరాతవృత్తి నవలంబించెను. బుద్ధిమంతుల నాతఁడు దరికిఁజేర నీయఁడు. శైశవమునం దాతనికి నక్షరాభ్యాసమే కాలేదు. గర్వోద్ధతచాపలమున నారాజకుమారుఁడు దుర్వృత్తనుఁడయి యుండెను. ఆతనివలన సమస్తకష్టములఁబొంది యాతనిమంత్రులు బహులదుఃఖాన్వితులయి అన్యాగతమున 'అక్షరజ్ఞుఁడు

గాని యతనికి శాస్త్రపురాణాగమాదులు రావు. గ్రంథాధిగమ
శక్తిగలుగక శుద్ధవివేకము లేదు. వివేకశుద్ధిలేక కర్తవ్యాకర్త
మెఱుఁగఁడు. కర్తవ్యమెఱుఁగక చేయు క్రియలవలన నరుఁడు
తీరనికిల్బిషములఁ బొందును. కిల్బిషములఁ బొందినవాఁడు నరక
కూపమునఁ ద్రెళ్ళును. నరకవాసి పేదనరుఁడగును. పేదయై
కడుపుకొఱకుఁ బాతకములుచేసి రౌరవమునఁ గూలును. తిరిగి
పేదయైపుట్టును. ఇట్టియాపదలకెల్ల మూలము చదువులేమి."
అని చింతించుచుండిరి. ఆ రాజకుమారుఁడును నెలుకవేఁటల
పేర నేగి పట్టణములోని ప్రజలయిండ్లు కూలఁద్రవ్వఁ బంపును;
డేగలకుఁ దొండలనేయఁబోయి ప్రాకారమంటపములు గాసి
చేయును; కోడిపోరులపేర వాడలఁదిరుగుచుఁ బోడఁగన్నకడ
వలఁబొలియవైచును; వేఁటకుక్కలఁదెచ్చివిడిచి మందలలోని
మేఁకలకుసికొల్పి మెచ్చియూర్చును; కాలకింకరులవంటి భటు
లతోఁగూడి మదమున వెడఁగుఁదనము, ప్రల్లదమును వేన
వేలు చేయుచుండెను. ఉరులు, బోనులు, గూళ్ళు, గాలిపడ
గలు, పరుసనిచెయ్దములు, భటులను బోడిపించుట–ఇట్టి సరభస
ములేకాని యాతని కితరములు పనికిరావు. ఆ నరపతికుమారుఁ
డొక వానరపోతమునుదెచ్చి వాత్సల్యముతోఁ బెంచుచుండెను.
దానికి ఆయుధవిద్య నేర్పించెను. అది క్రమముగాఁ బెరిగి పెద్దది
కాఁగాఁ గంచుకముదొడిగి, కత్తినిచ్చి రాజు దానిని తనకుఁ
గావలియుంచుకొనెను. ఒకనాఁ డారాజు మందిరోద్యానము
నకు స్త్రీజనములతోఁ బోయి విహారముసల్పెను. పిమ్మట
నొడలు నిద్రాలసముకాఁగా వారినందఱ నక్కడక్కడ వసి
యింపుఁడని పంచెను; వనచరమొక్కటి తోడురాఁ బోయి పరి
మళమృదుసితపవనమునకు నెలవైన గురివెంద పందిరినీడల

గుజ్జుసెజ్జఁ బరుండెను ; 'నన్ను డాయవచ్చిన జీవులను ఖండింపు' మని వానరముతోఁజెప్పి రాజు నిద్రించెను. కోఁతి పనివూని భూపతిని గాచియుండెను. రాజుకంఠమున వ్రేలాడుచున్న పూల దండ తావికి భ్రమరమొకటి యాసమయమునం దక్కడకు వచ్చెను. దానిఁగని వ్యగ్రకోపమునఁ గోఁతి ఖడ్గమువిసరెను. తేఁటితోఁబాటు ధరణికాంతుని కంఠముకూడ రెండయ్యెను. అవినీతుఁడయిన పతిచేష్టలు చేటుఁదేకుండునా ?

ఇఁక వివేకియైనచోరుఁడు శత్రుఁడయిన విప్రుని గాచిన విధము చెప్పెదను. వినుఁడు.

నందినీనామ నగరమున బంధుకుఁడనియెడు నొకబ్రాహ్మణుఁడు గలఁడు. ఆతఁడు మొదట ధనవంతుఁడే. కాని యవిలంఘ్యమయిన దైవఘటనమున నాతనికిఁ బేదఱికము వచ్చెను. అతనిపుత్రులు, పాపము ! పిన్నవారు. కటిబద్ధమయిన మాసినచింపివాఁత, జడలుగట్టిన పింగళకేశములు, దీనమయిన యాననము, ఒడ్డాణమునకుమాఱు రజ్జువలయము గలిగి దుఃఖవ్యాప్తినియైయున్న తనగేహినిని ఉత్కటబాష్పాక్షుఁడయిచూచి బంధుకుఁ డాత్మగతమున నిట్లుతలపోసెను. 'ఈ దారిద్ర్య మొకశార్దూలమువలె నున్నది. బలవద్దైన్యమే ఈపెద్దపులి వక్త్రగహ్వరము. పలుతావులనుండి తెచ్చిన యప్పులే దీనిమేనిచాఱలు. బాలరుదితమే దీనిబొబ్బరింతలు. అరణ్యమువంటి యీ మన్నిలయమునఁ నీ దారిద్ర్యశార్దూలము భయంకరముగఁ జరించుచున్నది. లావుకలిమిని దీనిని వెడలించుట శక్యముగాదు. అయినను దీనిని బాపఁదగుయత్నముచేసెదను. చిత్రవర్ణనగరములో నాతమ్ముఁడు విపులుఁడున్నాఁడు. అతఁడు గుణగరిష్ఠుఁడు ; పూర్ణధనుఁడు. నే నీవిధమున

బీదనయియున్నసంగతి తెలిపితినేని వాఁడు విచారించి కొంత ధనమొసఁగును. ఆ ధనమునుగొనివచ్చి యిచ్చట కర్షకుఁడ నయ్యెదను. ఈలోకమున జీవయాత్రగడుపువారు నాలుగు పాళ్ళుగనున్నారు. భిక్షుకులు, సోమకులు నం దొకపాలు. విద్యోపజీవికులును, సేవావృత్తివలన బ్రదికెడువారును మఱి యొకపాలు. వ్యవహారమాడెడువారును, తస్కరులును మఱి యొకపాలు. కర్షకు లొకపాలు. మొదటిమూఁడుపాళ్ళవారును నాలగవపాలివారిని అనఁగాఁ గర్షకులను అనవరతము నపహ రించుచుందురు. అట్లపహరించియు వారు కాలక్రమమున నశింతురు. అపహృతమైనకొలఁదియుఁ గృషి వృద్ధిఁబొందుచుం డును. కావునఁ దగినరాజు గలిగినచో వ్యవసాయజీవనమువంటి యుత్తమజీవనము మఱియొకటిలేదు.' ఇట్లుతలఁచి యాతఁడు ప్రయాణమయిపోయి కతిపయదినముల కనుజునిపురిఁ జేరెను. మున్ను బేదయై నలిగినదానికంటె పథశ్రమమున మిగులఁ గృశ మైనశరీరముతో నాతఁ డనుజాగారమును జేరవచ్చెను. విపులుఁ డల్లంతదూరమున నగ్రజునిగని సందేహించి గమనరేఖవలనఁ బోల్చెను. బంధుకుఁ డపుడు తమ్ముని డగ్గుత్తికతో దీవించి కౌఁగలించుకొనెను. పిమ్మట విపులుఁడు భక్తిప్రమోదము లతో నగ్రజునకుఁ దగునుపచారములు సల్పెను. అన్న విపన్నుఁ డగుట తెలిసికొని యాతఁడు మిక్కిలి దుఃఖితుఁడయ్యెను; అన్న నిష్ట దేవతగాఁ గొలుచుచుండెను. ఇట్లొకమాసము గడచెను. పిమ్మట బంధుకుఁడు తమ్మునితో నొకనాఁటిరాత్రి 'రేపు నావశ్యముగా నేను బయనముచేయవలయు'నని నిర్బంధించి పలికెను. అప్పు డర్ధరాత్రిసమయమున నా విపులుఁడు తన యంగణమున సాంద్రమాధవీలతాచ్ఛన్నమగు చూతకుజము

క్రిందికిఁ బూర్వజుని దోడ్కొనియేగి ప్రయాణవిషయము
ప్రస్తావించి 'కనకముఁగొనిపోవుట మిక్కిలిభారము. పైఁగా
దొంగలవలని భయముగలదు. కావున నేను మీ కనేకనిష్క
సహస్రమూల్యమగు నొక్కమాణిక్య మిచ్చెదను. అది మ్రింగి
మీరు ప్రభాతకాలమున జీర్ణమలినాంబరముల ధరియించి
యరుగుఁడని చెప్పెను. పిమ్మట వారు పోయి నిద్రించిరి.
వారిమాటలన్నియు దగ్గఱ చెట్టుమీఁదనున్న చోరుఁడొకఁడు
విని ప్రమోదముతో నిట్లు తలంచెను. 'కన్నము పెట్టిన
కంచము, చీర మొదలయినవిమాత్రమే యబ్బును. ఆ యబ్బుట
యైనను ప్రమాదసహితము. ఈనాఁడు నాకెంతో లాభము
గల్గినది. ఇఁకఁ గన్నపువేఁట ప్రయత్నము విరమించెదను.
తెల్లవాఱుజామున నీవిప్రునితోఁబోయి వీనిని చంపి మణిని
గైకొని ధన్యుఁడనయ్యెదను.' ఇట్లు నిశ్చయించి వాఁడు వెడలి
పోయి ప్రభాతమయినతోడనే పయనమయిపోవు బ్రాహ్మణుని
వెంబడించెను. సాధునివలె బ్రాహ్మణునితోడ సముచితభాష
లాడుచు నాదొంగ తానుచేయుపనికి వీలు కనిపట్టుచుండెను.
ముందటియడవిలో విప్రునిజంప వాఁడుద్యమించియుండెను. కాని
వా రడవిదగ్గఱకు వచ్చునంతలో దొంగలగుంపొకటి వచ్చెను.
ఆదొంగలు వారినిరువురఁ బంధించి బాధింపఁజొచ్చిరి. 'మేము
దరిద్రుల'మని వారిరువురును గోలపెట్టిరి. అప్పుడు దొంగలు
'వీరిశరీరముల కీకోకలు తగినవికావు. ఇవి తప్పక కపటవేష
ములు. వీరిమాయలకుఁ దగిన యుపాయము మనకు లేదా?
వీరిపొట్టలు చీఱుఁడ'మనిరి. అనఁగా నాగుంపులో ముఖ్యులగు
వారు కొందఱు 'ముందొకనికడుపుఁ జీఱుదము. అందులో
పసిఁడిలేకున్న రెండవవానిని విడిచిపుత్తము. పసిఁడియున్నచో

రెండవవానిపొట్టగూడఁ జీలుద'మని కార్యనిశ్చయముచేసి పలి
కిరి. ఇరువురిలోపల నొకని వధింప దొంగ లుద్యుక్తులుకాఁగా
చోరుఁడు తనమనమున నిట్లుతలంచెను. 'అవురా! నే నేమి
తలఁచివచ్చిన దైవము తా నేమితలఁచెను! తా నొకటితలఁ
చిన దైవము మఱియొకటి తలఁచుననుమాట తథ్యమయినది.
పావనుఁడయిన బ్రాహ్మణుఁడని చింతింపక యకారణముగ
నీతనిని జంపఁదలఁచితిని. నేను పాపాత్ముఁడను. నాకర్మమిట్లుం
డఁగా నాతలఁపు లెట్లు నెఱవేఱును? ఉత్తమవంశజుఁడు, అతి
ధార్మికుఁడు, ఎవరికిని గీడుచేయనివాఁడునైన పురుషావతంస
మునకు నిష్కారణముగ నెగ్గొనరింపఁజూచిన దురాత్ములకుఁ
జేటుఁదప్పునా? దైవముకన్నులు పొట్టుఁజీకులా?—ముం దితని
కడుపు వ్రచ్చినచో దొంగల కందు రత్నముదొరకును. అప్పుడు
నాకడుపుకూడ వ్రత్తురు. నాకడుపే ముందు చీలుచు లేని అందు
కనకము గానక ఈవిప్రుని విడిచిపుచ్చెదరు. నా కెటులయిన
మరణముతప్పదు. కావున నిఁక బహుచింతనములఁ బనియేమి?
ఈతనిని రక్షించెదను. ఈ బ్రాహ్మణునిప్రాణముఁ గొనఁదలఁ
చిన నాపాపము ఈతనిప్రాణముఁగాచి యితనికి నాప్రాణ
మీయకున్న నెట్లుపాయును?' ఇట్లు కృతనిశ్చయుఁడయి
వాఁడు తనకడుపు ముందు చీల్చుఁడని చోరుల వేఁడుకొనియెను.
ఆప్రార్థన మంగీకరించి యాచోరులు తొలుత వానికడుపువ్రచ్చి
యం దేమియుఁ గానక 'వృథాగా వీనినికూడఁ జంప నేల?' యని
విప్రుని విడిచిపుచ్చిరి. అట్లా చోరులచే విడువఁబడి బ్రాహ్మ
ణుఁడు దారసుతాదులఁ గలసికొని సుఖముగా నుండెను.
వివేకవంతుఁడగుచోరుఁడు స్వర్గమునకుఁబోయి ధన్యుఁడయ్యెను.
అవివేకుల చరిత్ర మాకోఁతిచరిత్రమువంటిది. వివేకులచరిత్ర

మీదొంగకథవంటిది. ఆపదలకు దూరులై యుండఁదలఁచిన వారు సవివేకులసంగతి నుండవలయును; వివేకహీనుల విడనాడ వలయును."

ఇట్లు మకరందిక యెఱింగించెను. సుమతి, సుకుమారిక లామెను గొనియాడిరి. ఇట్లు కొంతతడవు సుఖగోష్ఠి యొనరించి యాపరిచారికలు మువ్వురును సముచితవ్యాపారములకుఁ జనిరి.

---

## ౮

# మృగాంకావళీసందర్శనము

రత్నసుందరీదేవి కినుకతో నిజనివాసమునకుఁ బోవుటచేత కేయూరబాహుని కుల్లమునఁ దాపముగల్గెను. పరిహాస భాషావిన్యాసముచే నెట్లో దినముగడపి చారాయణుఁడు వెడలి పోయెను. సాయంకాల సంధ్యావందనము మొదలయిన కృత్యముల సల్పి రాజు నిద్రావాసమునకుఁబోయెను. అచ్చటనుండి రాజు దేవికొఱకు నేర్పుగలయట్టి ప్రియదూతికలఁ బంపెను. కాని దేవి రాలేదు. అగుటచే రాజు వెచ్చనియూర్పులు నించుచు, వేదనఁబొందుచుఁ, గన్నులు మోడ్చుచు, సెజ్జపయిఁ దనువుఁ జేర్చియుండెను.

ఇంతకు ముందుగానే కళావతి మంత్రి భాగురాయణుని కడకుఁబోయి రత్నసుందరీదేవి యుర్వీశునిపయిఁ దప్పులు వెట్టి

రాత్రిపడుకకు రాకుండుట తెలియఁజెప్పెను. అంత భాగురా యణుఁడతిప్రీతితోడ కళావతిని మంచిపసదనమునఁ దృప్తి పఱిచి లాటేశ్వరుని పుత్రిక నలంకరించి యచ్చటకుఁ దీసికొని పోవునట్లు పలయుబుద్ధులుచెప్పి వీడ్కొల్పెను. చెలికత్తెయై మెలఁగుచు మృగాంకావళిని మున్నె యెఱిఁగినది కావున కళా వతి ఆమెను నెయ్యమునఁ దోడ్కొనిపోయెను. వారు రాజ మందిరోద్యానమున నిర్మింపఁబడిన వసుధావల్లభుని శయనా గారమునందుఁ బ్రవేశించిరి. ఆమందిరము భాగురాయణుని యాదేశమున యంత్రవిశేషములతో నిర్మింపఁబడినది. ఆ శయనగృహస్తంభకుడ్యములలోని యంత్రకీలములఁ ద్రొలఁగించు తెరువును, కదియించు నుపాయమును; ఆ నికేతనమునకుఁగల ప్రవేశనిర్గమస్థానములును; అందు సంచరించువిధములు నిం తకుముందే కళావతి మంత్రివలన తెలిసికొనియుండుటచే నామె మృగాంకావళితోఁగూడ నయ్యంత్రమున నాకుడ్యము లోపల వచ్చి యొక స్తంభమునొద్దకుఁ జని యిట్లనియెను.

"ఇది మహారాజునిద్రాగారము. ఇందు నిద్రించుచున్న వాఁడు కేయూరబాహుమహేశ్వరుఁడు. నిన్నీ స్తంభము పార్శ్వమున వెలువరించెదను. నీ వచ్చట మహీనాథుఁడు నిద్ర మేల్కొనువఱకు నిలిచియుండుము. అతఁడు తెలివొంది నిన్నవ లోకించును. అప్పుడు నీ యభీష్టముసిద్ధించుకొఱకు నీమనమున నతనిఁ బ్రసవశరాసనుఁగాఁదలఁచి నిన్ను రతీదేవిగా నిరూపించు కొని కంఠముననున్న యీతారహారమునుదీసి నమస్కృతివచన పూర్వకముగ నతనిమెడలో వేయుము. అతఁడు నీకరగ్రహము చేయఁగోరెనేని 'రత్నసుందరికి వెఱతు'నని పలికి తప్పించుకొని మఱియొకరితెరఁగతి నేతెంచి యిందుఁ బ్రవేశింపుము." ఇట్లు తెలి

ముఁజెప్పి కళావతి మృగాంకావళిని సదనాభ్యంతరముపొంద వెలువరించెను.

తనదేవితో నెయ్యపుటలుకఁబూని యేకతముగా నిద్రించుచున్న కేయూరబాహుని మృగాంకావళి చూచెను. అతఁడు ప్రద్యుమ్నకుమారునివలె నొప్పుచుండెను. ఆ రాజశేఖరుని సౌందర్యమునుగూర్చి యామె యింతకుముందు వినియున్నది. ఆవినుకలికూర్మిని గీలుకొనినవేనుక యాశలు పుట్టింపఁగా నా నరేంద్రకన్యక నిద్రితుఁడయియున్న భూపతిని తెప్పవేయక కనుఁగొనుచుండెను. అంతలో మేలుకువవచ్చి ధరణీతలేశ్వరుఁడు కన్నుఁదోయియరవిచ్చెను. అప్పు డాతఁడు లాటవసుధాధిపపుత్రికను జూచి 'రత్నసుందరివచ్చెఁ గాఁబోలు'నని తలఁచెను. కాని నిదానించిచూడఁగా నామె కాకపోయెను. అందు కాతనిచిత్తమునం దాశ్చర్యమును సందేహమును సందడిగొనెను. ప్రకటితదేహదీప్తి, విభాసితభూషణదత్తదీధితి గలిగి చంద్రరేఖవలె నొప్పుచున్న యామె నాతఁడు గాంచుచుండెను. వాని చూపులు విస్మయమందెను. ఆసమయమున నారాజకన్యక యుప ద్భృతతారమౌక్తికసముంచితనాయకరత్నమయి, సమంజస రుచిపుంజమయి తనకంఠమున వెలుఁగు హారమునుదీసి ప్రియముఁ జేరి 'నమః ప్రసవశరాసనాయ'యని పలుకుచు భూపతి కంఠమున వైచెను. ఆ మహీకాంతుఁ డామెవిలాసమునకుఁ జొక్కి, సెజ్జ డిగి, ఆమెను సమీపించి 'అతివా! నీ వెవ్వరిదానవు? నీకుఁ బే రెయ్యది? ఇచ్చటకు ని న్నెవ్వతె తెచ్చెను? ఇది యంతయు నేర్పడఁజెప్పి న న్నేలుకొను'మనెను. పిమ్మట వసుధేశ్వరుఁ డతనిహస్తముపట్టెను. అప్పుడు మృగాంకావళి ధైర్యముద్రవ్వేడు కన్నులతో రాజు నదల్చెను; చేయిపట్టు

వదల్చుకొనెను; 'రాజా! నీవు రత్నసుందరి కోడుదువు. మా మ్మేలపట్టెదవు? తొలఁగిపొమ్మనుచుఁ గంబమునొచ్చి జంత్రము గదియఁదిగిచి యుజ్జ్వవదన యదృశ్యమయినట్లు వెడలి పోయెను.

అంతఁ బ్రత్యూషమయ్యెను. లెక్కించుటకు సులభ మయి యాకాశమునఁ జుక్కలు ప్రాఁతముత్తియములపగిది నుండెను. ఉదయాచలముమీఁద నప్పు డొదవెడు కెంజాయ మాణిక్యవేదితో మచ్చరించుచుండెను. అమృతభానుఁడు కాంతిఁగోల్పోయి యాకాశనదఁ గ్రేవను మునియుంచవలె నుండెను. గృహములందు దీపవితతి వెలరువాఱుచుండెను. నలిన ములు కుముదముల నవ్వుచుండెను. నలుదిక్కులు తెలివొందు చుండెను. జలజవనమునకుఁ గూర్మిచెలికాఁడు, చుక్కలపయి దాడికాఁడు, త్రిజగములచేత మ్రొక్కులు గొనువాఁడు, వేద ములు మొలచినపాఁదు, యోగులకు మోక్షమువాకిలి, ప్రాణి కోటికి వెలుఁగు—అయిన సూర్యభగవానుఁడు తూర్పునఁ దోఁచెను. అప్పుడు ప్రాతఃకాలకృత్యములఁ ద్వరితముగఁ దీర్చి కేయూరబాహునాథుఁ డొంటరిగఁ గూర్చుండియుండెను. అంతలో భయభక్తిసమేతముగ జయవెట్టుచుఁ బ్రియసఖుఁడగు చారాయణుఁడు వచ్చెను. అతనిఁజూచి నరపతి యిట్లుపలికెను.

“చారాయణుఁడా! ఏమిచెప్పుదును? ఈరాత్రి తెల్ల వాఱుజామున మున్ను జను లెవ్వరును నెక్కడను గానని యొకచోద్యముగంటిని. నిజము. చెప్పెదవినుము. ఎలనాఁగ యొకతె నాసుప్తిమందిరమున కేకతమున వచ్చినది. అట్టి రూపమహిమ మానవాంగనల కసదృశము. ఆమె చైతన్య మొందిన చక్కనిచిత్రము; చిఱునవ్వుమరగిన చిగురుబొమ్మ;

నడుపాడ నేర్చిన నవకంపుననుదీఁగ ; మురిపెముఁ బూనిన
విరులమొత్తు; వంకవాయఁబెట్టివచ్చిన క్రొన్నెల ; పలుకభ్య
సించిన పసిఁడిప్రతిమ ; నిలుకడవడసిన తొలుకారుమెఱుఁగు.
అట్టి లావణ్యవతి శయనతలముననున్న నన్నుఁ గదియఁజను
దెంచి తన కంఠమున వెలుఁగు నొక్కయుజ్జ్వలతరహారవల్లి
పువ్వువలపైచినట్లు నామెడలో నుంచెను. ఆయవసరమున నే
నామె పృష్టాపూర్వోత్తరములు తెలిసికొనఁగోరి యామెపాణి
సరోరుహము పట్టితిని. 'రత్నసుందరికి వెఱతు'నని కోమల
ముగఁబలికి కన్నులనదల్చుచుఁ దనహస్తమును వదల్చుకొని
యామె మాయమయినది. అట్లుపోవుచు నాసుందరి నామన
మును హరించుకొనిపోయినది. వెంటనంటితినిగాని యామె
యాకాశస్పర్శకరముగా నదృశ్యమయినది. వయస్యోత్తమ !
యప్పటినుండియు నాచిత్తము సందియపుఁజీఁకటిని బడియున్నది.
ఇది కలయా ? నిక్కమా ? లేక యిది కల్లనిజముల యేకీ
భావమా ? యిది నిజముగాఁ గలయేయగునచో నేతలంపుల
ముందుబెట్లు ? ఒకవేళ నిది నిజమేయగుచో నావెడఁద
వాలుఁగన్నులసుందరి యేది?"

ఇట్లు వికారభ్రాంతపూర్ణస్వాంతుఁ డయిన భూపతిని
జూచి రత్నసుందరీసౌభాగ్యగర్వాపహరణ క్రియాచింతైకపరా
యణుఁడగు చారాయణుఁడు సంతసించెను. పిమ్మట నాతఁడు
"రాజునకు రత్నసుందరిపయి నిలిచినమనము కొంతవఱకుఁ
జలించినది. ఇంక నీతనిమనము మఱియొకమానినిదెస మరలు
నట్లు ఘటింతు"నని తలఁచి వయస్యునితో నిట్లనియెను. "జగతీ
నాయకా ! యింత యేమిటికి ? నీసౌందర్యజాలమునఁ జిక్కనది

దేవకాంతయైనఁ దిరిగిరాకుండుటకు ధైర్యముచాలదు. ఇందుకు సందియములేదు. నామాట నమ్ముము. ఆమగువను నీకుఁ జూపి ఆమెసంబంధము నీకు సులభముగా సంధించెదను.”

---

# ౯
# చారాయణుని ప్రస్తావము

ఇట్లిచ్చట నీవిధమునఁ జెల్లుచుండ నట రత్నసుందరి మేఖలకుఁ బ్రియముచేయ నుద్దేశించియు రాజు చారాయణ ద్వితీయుండయియుండుట విని విదూషకునిమీఁది కోపమున నటుపోవక సపరివారయై నిజనివాసమునందే యుండెను. ఆ దేవి యాగ్రహము అనుగ్రహముగా [illegible] భుండు నిజసఖునితో మందిరారామమునకుఁ బోయెను

అది వసంతకాలము. చిగిర్చిన చెట్లు, పుష్పించిన భూజములు, ముసిరెడు తుమ్మెదలు, వీఁచెడు చల్లగాలి, పాడెడు కోకిలలు, పలికెడు చిలుకలుగలిగి యామందిరారామ మ[illegible]నికి మఱింత తాపముగల్గించెను. అగుటచే నాతఁ డందు విహరింపఁ జాలక యొకరమణీయలతామందిరము చొచ్చెను. అందలి చంద్రకాంతవేదిమీఁదఁ దనువువైచి పొరలుచునుండి కొంత సేపటికి లేచి కూర్చుండి తనకంఠమునందు దాకాంత మాన్పిడిన ముక్తాహారమును గ్రహించి పరిపరివిధములఁ జింతించుచు నిట్లని

ములకు బోనయ్యెను. అప్పుడాతని నక్కడనుండి గొనిపోవఁ దలఁచి చారాయణుఁడు "వయస్యా! వనవిహార మింకఁ జాలును. ద్యూతక్రీడ యొనరింతము. నిజనివాసమునకు విజయము చేయు"మనెను. ఇట్లుచెప్పి రాజును గొడ్కొని చనెను. అచ్చట నాతనికి రసాంతరముపుట్ట వినోదములు, నీతిగర్భితములగు కథావిశేషములును వినిపింపఁదలఁచి చారాయణుఁ డిట్లు చెప్పెను.

"రాజా! చూచితివా? రత్నసుందరీదేవి మేఖల నెల్లప్పుడును జాల మన్నించును. అందుకు మత్సరముపూని నయవిధిజ్ఞయగు కళావతి నన్నుఁబంచి దానిని భంగపెట్టించెను. మతిమంతులు నిజశత్రువుల నేవిధముననైన నితరులసహాయముఁగొనియైనఁ జెఱచెదరు. బుద్ధిబలమునఁ జిలుకయొకటి తనపిల్లలఁ జంపనెంచిన కిరాతుని మృతుని జేసినవిధము వినలేదా?" ఆపలుకులు విని "అది యెట్లు"అని మహీనాయకుఁ డడిగెను. అంతమీఁద చారాయణుఁ డిట్లు చెప్పఁ దొడఁగెను.

"ఒక పెనుగానలో నొక మహోన్నతభూజమునందుఁ జిలుకయొకటి ఱెక్కలురాని బాలశాబకములఁ బ్రోచికొనుచు నుండెను. చిలుకయున్న తరువునొద్ద చిక్కని వెలఁగమ్రానొకటి గలదు. ఆవెలఁగచెట్టుకోటరమున గరళోల్బణుఁడయిన ఫణినాయకుఁడొకఁడు జీవించుచుండెను. ఇట్లుండ నచ్చటికొక నాఁడు బోయఁడొకఁడువచ్చెను. వాఁడు మున్నొకసారిచిలుక పిల్లలఁ గొనిపోయెను. మఱల నిప్పుడు వాఁడు భూరుహ మల్లన నెక్కి పిల్లలఁబట్టుచుండెను. అప్పు డాపిల్లలు చంచులు దెఱచుచు నఱవఁదొడఁగెను. అయినను వాని కించుకయయినఁ

గృప జనింపలేదు. అదిచూచి శోకించుచు, రోధించుచుఁ బలవించుచుఁ జిలుకవెలఁది యాతని కిట్లనియెను. 'అన్నన్నా! యివియే గాని నీకుఁ బట్టనిఁకఁ బక్షులు లేవా? కన్నులు తెఱవనివి, వీనినిదిన్న చవిఁగలదా? నాజీవముల నేలఁగొందువు? విడువుము. శిశువులను జంపఁదగునా?' ఆమాటలకు బోయఁ డిట్లుబదులుచెప్పెను. 'నీవెందు కడలెదవు? నీపిల్లలను జంపను. మాంసము నాకు దుర్లభము కాదు. వీనిని దీసికొనివెళ్ళి వెలవెట్టువారి కమ్ముదును. కొని వారు వీనిని బెంచెదరు. కాని యెట్టిపీడయుఁ జేయరు. నామాట నమ్ముము.' అప్పుడు చిలుక యిట్లుపలికెను. 'వీనిని జంపుటకుఁగాక కనకముకొఱకుఁ బట్టితిననుచున్నావు. అట్లైన నాపిల్లలను విడిచిపెట్టుము. నీకు నేను కావలసినంతధనముఁ జూపెదను. దొంగలగుంపుబాధకు భయపడి మొన్న ధనవంతుఁ డొకఁ డీయడవిలోఁ దనధనమంతయు నొకచోట దాఁచెను. దాఁచుచుండఁగా నేను జూచితిని. అది నీకుఁ జూపించెదను. నన్ను నాపిల్లలను నెల్లప్పుడు గాచెదనని వంతఁబాపి రక్షింపుము.' చిలుకచెప్పినమాటలకు బోయఁ డప్పుడే పెన్నిధిఁ గన్నవిధమున నానందమును బొందినాఁడు. 'నీకు నాయెడ నమ్మకముగల్గునట్లు చేసెద' ననుచు వాఁడు శాబకములను నిడములోఁబెట్టి వెంటనే భూమిజముదిగి నియతుఁడయి యొక్కచో నిల్చి యుర్లును బోనును బట్టి నమ్మఁదగుపలుకులు పలికెను. అప్పుడు కీరవనిత 'నమ్మిక లవి యేమిటికి? నేను చూపినసొమ్ములపయిఁ జేయివెట్టి సుఖివయినతరువాత నీవు తిరిగి ఖగమృగములకు దుఃఖముగల్గించుటకు వత్తువుగనకనా?' యనివచించెను. పిమ్మట వానిని రమ్మని తోడ్కొని చని

పామున్న వెలఁగమ్రాని వెడఁదతో నటచూపి 'విశేషహేమము దీనిలో నున్నది. చేయి పెట్టి చూచుకొను'మని చెప్పెను. వెంటనే వెట్టిబోయఁడు కుడిచేయి యందుఁ జొనిపెను. కన్నుల నిప్పులురాల్చుచున్న యందలి మహనీయగరోజ్జ్వల భీషణోరగ మాతని బొట్టనవ్రేలినదుముఁ గఱచెను. తోడనే యాతనికి విషమెక్కెను ; దృష్టి చీఁకటులుఁగప్పెను ; నోటియందుఁ బెన్నురువు గ్రమ్మెను ; నేలఁగూలి వాఁడు మృతినొందెను.

ఆశ మిక్కిలిపాపజాతిది. అది యన్నిటిమీఁదఁ బ్రసరించును. ఇఁకఁ బసిఁడిమీఁద నేలఁబాఱకుండును ? పసిఁడిమీఁద నాశపుట్టిన మనుజుఁడు తనకువచ్చుకీడు తెలఁపఁజాలఁడు. తన కసాధ్యుఁడయిన శత్రునిఁ దనకేమియుఁ దెలియనట్లే యుండి యన్యునిచేత నయిన ద్రుంగునట్లు చేయవలయును. పగవాఁడనయిన నాయెడ మొగమోటపడి మేఖల నావాక్యముల నమ్మినది. కార్యము మిగిలివచ్చినను నిజము తెలిసికొనలేక పోయినది. అది బుద్ధిలేనిదికాదా? మొగమోట ముండవలసినదే. కాని దానికి మితమున్నది. అది యెక్కువగానున్న కష్టమువచ్చును. ఇతరుల నెప్పుడును నమ్మఁదగదు. నమ్మినచోఁ దగువారినిమాత్రమే నమ్మవలయును. కాని పగవారిని నమ్మరాదు. అట్టివారిని నమ్మకతప్పనిచోఁ గార్యమగువఱకు నమ్మినడవవలయును. పిమ్మట నేమఱక తొలఁగివచ్చి నమ్మకయుండవలయును. ఈయర్థమును దెలుపు నహిమూషికోపాఖ్యానము నెఱిఁగింతును. అవధరింపుము.

పాములఁబట్టువాఁ డొకఁడు పాము నొకదానిని బట్టి వెదురుపెట్టెయందుంచెను. అందాపామున కెరగా మూషకము నొకదానిని వైచెను. అప్పుడు పాము ఎలుకను గఱప

వచ్చెను. అందుమీఁద నెలుక బెదరక పాముతో నిట్లని యెను. 'నీ కొకయుపకారముచేసెదను. నా కభయమిచ్చి రక్షింపుము. నాతోడ నీవు చెలిమిపాటింతువేని నాకార్యమును నీకార్యమును నెఱవేఱును. వాఁడు పట్టినప్పుడే వానిచేఁ జచ్చియుందును. ఇప్పుడు నీచేనయినఁజత్తును. నా కెట్లును జావు నిజము. చచ్చియున్ననన్నుఁజంపి చావనినీవు చెఱలోనే యుండఁదలఁచుచున్నావు. ఇది నీకుఁ దెలిసినదా? 'నే నధికబలుఁడను. నాచేతఁగానిది యీ యెలుకచేతనగునా? ఇది నాచెఱ యేవిధమున మాన్పును? ఇది కల్ల.' అని మది నూహింపకుము. నేను చెప్పునది వినుము. ఎవ్వఁడేకార్యమునందు నిపుణుఁడో దానియందు వాఁడు పూజ్యుఁడు. వానిని హీనుఁడనరాదు. సూదిచేతనగుపని చిక్కని కత్తిచేతఁ జక్కనగునా? తన కార్యసాధనమునకయి హీనునియొద్దకు నయినఁ బోవచ్చును. నేను జెప్పినట్లు చేసినచో నీచెఱ విడును. అట్లుఁగాక నన్నుఁజంపి నోటిలోవైచుకొన్నంత మాత్రమున నే నీయాఁకలి చల్లారదు. చెఱఁబాసిన నీవు నీయిష్టమయినఁ జోటికిఁబోయి క్రీడింపవచ్చును. చిఱుకప్పలు, చేఁపలు, బల్లులు, చిట్టెలుకలు, ఎఱకలు విస్తార మాహారము దొరకును; కుత్తుకబంటిగాఁ దెమ్మెరలఁ గ్రోలవచ్చును. మఱియెన్నోసుఖములు గలుగును. ఈ సంగతుల నాలోచించుకొనుము.' ఆమాటలకు నురగము సంతోషముతో నిట్లని యెను. 'స్వప్నముననయిన నీకుఁ గీడొనరింపను. నీవు నా చెలివి. అనుమానము మానుము. ఆనందముతో నామాట నమ్ముము. ఇక్కరండనిగ్రహ మెట్లుడిపెదవో యుడుపుము.' అప్పుడు మూషక మిట్లువచించెను. 'నీతలపయినుండి నే నొక

మంత్రము జపించెదను. జపముయిపోయినవెంటనే నిన్ను బిలిచెదను. అందాఁక నీవు నయనయుగము మూసికొని కదలక యుండుము.' ఇట్లు నియమించి పాముశిరమెక్కి కరండనిగ్రహముఁజేసి యాయెలుక వెడలిపోయెను. అనంతరము నాగము లోచనములు విచ్చిచూచెను. అప్పుడు దానికి సంతోషము, విచారము నొక్కసారిగఁ గలిగెను. ఎలుక చేసినకన్నము వెంటఁ దానుకూడ వెడలివచ్చి భుజగ మొక బొఱియలో దూరి 'యెలుక కపటమున నాకన్నులుగప్పినది. నోటూర దానిని దినలేకపోయితిని. ఇఁక నా కేటిబ్రతుకు ?' అని తలఁచెను. దురాత్ముల కెందును న్యాయములేదుకదా! ఒకనికిఁ గీడుచేయఁగలిగిన ఖలుఁడయినవానికిఁ జాలును; తనకుఁగలిగెడు నింద్రత్వమయినఁ గాదనును; తుదిని తాను మరణించి నను మేలనితలంచును. ఆపామావిధమునఁ దలపోసి వెదకి మూషకబిలద్వారమును గుర్తించెను. ఆయెలుకకు దోషమాపాదించు నభిలాషమున నయ్యాశీవిషము దాని కలుగుకడకు నేగి 'ప్రాణసఖుఁడా! సత్వరముగ బయలికిరమ్ము. ఒక్కచోటనుండి యుచితసల్లాపములు చేయుద'మని పిలిచెను. పాతాళపోవుట కనేకమార్గములుగలిగి మృద్బద్ధమయియున్న బిల ద్వారముదగ్గఱ నిలిచి యాయెలుక యా ద్విజిహ్వముతో నిట్లనియెను. 'నీవు మునుపు నన్నుఁ గాచితివి. నేను నీచెఱఁ బాపితిని. నామీఁద నీకు మున్నుండినకరుణ మఱవక మన్నింపుము. నా కామాత్రము చనుమానము చాలును. తమకుఁ దలముగానివారితోడ వియ్యమందుట; కయ్యమొనర్చుట; చెలిమిచేయుట తగదు. నేను హీనబలుఁడను. నీచెలిమికి నే నెంతవాఁడను ? మున్ను నీవు నాకు వైరివి. కార్యార్థమాత్ర

మిత్రత్వమున నీవు నన్ను సహించితివి. ఇంక వేగముగాఁ దొలఁగిపొమ్ము. ఇన్నిపలుకు లేల? నిన్నుఁ జేరుటకు నాకు భయ మగుచున్నది.' ఎలుక చెప్పిన యీ మాటలకు సిగ్గుపడి పాము వెడలిపోయెను. మూషకము సుఖమున నుండెను."

ఇట్లు చారాయణుఁ డెఱింగించెను. ఇట్లే యిష్ట కథావినోదముల రాజును, చారాయణుఁడును కాలమును బుచ్చుచుండిరి.

---

## ౧౦
# కళావతి మాత్యము

మహీనాధుని వృత్తాంతము సమస్తము కళావతి భాగు రాయణునితోఁ జెప్పెను. ఆతనియాజ్ఞ వడసి యామె యొక నాఁడు రత్నసుందరిపనుపు నెపమున వచ్చినదివోలె కేయూర బాహుభూధవుఁడు చారాయణసహితుఁడయి యుండుచోటికి కేతెంచి మ్రొక్కెను. దేవీప్రేరితయై యది తనభావవృత్తి యరయ వచ్చినదిగాఁదలఁచి ప్రసంగవాక్యముల నింగితము నెఱిఁగి ధరణీశుఁడు దానిని గూర్చుండ నియమించెను. కళా వతి యాసీనయై వారినుద్దేశించి సస్మితాననముతో నిట్లని యెను. "ప్రభువరా! ఏకతమున మాటలాడుకొనుచు మీా

నేర్పులచేత నన్నేల మోసపుచ్చెదరు ? మీ కంఠమున నున్న హారము నాచేతులార గ్రుచ్చినది.'' ఈమాటలకు ధాత్రీనాథునిమనమున సందేహము, సంతోషము, ఆశ్చర్యమూ ముప్పిరిగొనెను. అప్పు డాతఁ డిట్లువచించెను. ''కళావతీ ! నీవును, చారాయణుఁడును నాకు సమానము. కావున నిట్లనుట నీకుఁదగదు. నిన్ను మా యేకతమునకు వారింపను. ఈ హారము మొదట నెవ్వరిదో చెప్పుము ?'' దానికి కళావతి యిట్లు బదులుపలికెను. ''చెప్పెద నవధరింపుము. లాటపురీవల్లభున కొకకుమార్తె గలదు. ఆమె నిఖిలజనలోచనసౌఖ్యావహలావణ్యవతి. పేరు మృగాంకావళి. ఇప్పుడు నీ హృదయమును హరించినకన్య ఆమెయే.''ఆ పలుకులు విని కేయూరబాహుమహీపాలుఁడు కళావతిని ''లాటేశ్వరుఁడగు చండవర్మకు మృగాంకవర్మయను పుత్త్రుఁడొక్కరుఁడుగాక పుత్త్రికయెక్కడిది ?'' అని యడిగెను. అప్పు డామెనవ్వుచు నలుదిక్కులును బరికించి యిట్లనియెను.

''ఇది యొక యత్యంతరహస్యమగు విషయము. ఇందలి నియమము చెప్పెదను. అవధరింపుము. లాటపతి కొకపుత్త్రిక గలిగెను. ఒకానొక కారణమున నామె నాతఁడు పుత్త్రనామమున వెలయించెను. అతనియన్వయపూర్వు లేకసంతతులయి యుండుట విధికృతము. బుద్ధిమంతుఁడగు నాతఁ డది తెలిసికొని తనకుఁ బుత్త్రుఁడు లేకపోవుట పరదేశరాజుల కెఱుకపడకుండ నీమంత్రమును బన్ని తనయను సుతునిగాఁ బ్రకటించెను. ఇట్లు రాజ్యమును సురక్షితముచేసికొనెను. అతనికి సుతసఁ యుండెనన్నవిషయము దేశమంతటను బ్రమోసెను. ఆ పుత్త్రిక నామము మృగాంకావళియైయుండఁ బురుషత్వము దోఁచునట్లు

మృగాంకవర్మయను పేరునఁ బిలుచుచుందురు. ఆ కన్యను బొందినవారికి సార్వభౌమత్వము కలుగునని మహాపురుషాదేశము. బుద్ధిమదగ్రేసరుఁడగు నీ మంత్రి భాగురాయణుఁడీరహస్యము సమస్తము తెలిసికొనెను. అతఁడు భవదీయ రాజ్యలక్ష్మీప్రవృద్ధిచింతానిరతాత్ముఁడు. అగుటచే దేవరవారా కన్యారత్నమును వరించి సార్వభౌమత్వమును బొందవలయునని యెంచి అతఁ డా రాజపుత్రిక నొక యుపాయముచేత నీపురమునకు రప్పించి తనమందిరమున నిడికొనియున్నాఁడు. కాని రత్నసుందరీదేవియందు భయము, భక్తి గలిగినవాఁడగుటచేత నావిషయము నీకెఱిఁగింపనేరక యున్నాఁడు. ఆ మహామంత్రినియోగమున రత్నసుందరి యెఱుఁగకుండ నాపురంధ్రీభూషణమునకు నెచ్చెలినయి వర్తిల్లుచున్నదానను. ఆ చేడియ రూపవిభవాతిశయములు నీవు చూడనివికావు. అసదృశతారమౌక్తికసమంచిత నాయకరత్నమయి, సమంజస రుచిపుంజమయి తనకంఠమున వెలుఁగు హారము నాబిసరుహహస్తపుచ్చుకొని చేరవచ్చి 'నమః ప్రసవశరాసనాయ' యని పల్కుచు నీమెడలోఁ బెట్టియుండలేదా ?"

కళావతిచెప్పిన యీమాట లమృతమువలె రాజు వీనులు చొచ్చి దిగఁబాఱి యాతనిహృద మంతయు నిండిపోయెను. అంతఁ గొంతసే పాజనపతి పూర్ణానురాగశరనిధిఁ దేలెను. చారాయణుఁడును బ్రమోదితహృదయుఁడగుచు కళావతిని పెక్కుతెఱఁగులఁ బ్రశంసించెను. అప్పు డా మేదినీనాథుఁడు కళావతిని బహువిధములఁ గొనియాడెను; బహుళరత్నభూషణాంబరాదికముల నొసఁగెను ; అరలేనిచెలిమిని గారవించెను. రాజు లాటరాజనందన యనంతరవృత్తాంతము వినఁ గుతూ

హాలములో నుండుటయెఱిఁగి తిరిగి కళావతి యిట్లు చెప్పెను. "ఆనాఁడట్లామె దేవరచేత గృహీతయయ్యును నటమున్న నాచే బోధితయై యుండుటవలనఁ గులపాలికాధవంబయిన ధైర్య మవలంబించి యెట్టకేలకుఁ దనకరము విడిపించుకొన్నది. నీ శయనగృహము సుషిరస్తంభకుడ్యరచితమగుటచే నామె యంత్రస్తంభమున నదృశ్యమయినది. అప్పుడాయంభోరుహ వదనను నామెసదనమున విడిచి ప్రభాతమగుటవలన నాయిం టికిఁ బోయితిని. అచ్చట నేను గొంచెముసేపుండి మరల నామెయున్న తావునకు వచ్చితిని. అప్పటి కామానవతి బహు విధ మన్మథవికారమగ్న మానసయయి యుండెను. అది యంతయు నాకుఁజెప్ప సిగ్గుపడినది. అగుటచే మనోభావము నంతయుఁ బద్యత్రయముగా రచించి యొక్క కేతకీపత్రమున లిఖించి పొరపాటునఁ బడవైచినట్లు జారవిడిచి నన్నుఁగని మిథ్యానిద్ర నభినయించుచు నావలిమొగమయి యుండెను. నేను సమీపించి కేతకీపత్రమును గనుఁగొని అందలి పద్య త్రయము నిట్లని పఠించితిని :

"ఉ. తాడిడి పండుఁదిన్నక్రియఁ దద్దయుఁ గాలముగోరుచుండఁగాఁ
జూడఁగవచ్చునే నృపతిసుందరు నింకొకమాఱు? గ్రమ్మఱన్
జూడఁగనైన నోఁచునొకొ చూడ్కి? కళావతి! దేవి కాత్మలో
నోడి ప్రమాదకార్య మిది యొప్పదు వొమ్మనునొక్కొ? దైవమా!

చ. ఇటనటఁ జూడరా దతని నింత యొకప్పుడు నాదు నిండ ముం
దటఁబొలయంగ నీకిది ప్రధానుఁడువల్కెఁగఁ జాము యిద్ది నీ
చిటిపొటిపొన్న చుక్కలకుఁ జేతులు సాఁచుట గాదె? యిట్టి దు
ర్ఘటనపుఁగూర్మికిన్ శరణుగల్గునె? యెట్లువలంచిమాచిసన్.

ఉ. ఒంటియయుండి తోయి విభుఁ డుల్లమునం బ్రియమారఁ నన్ను నీ
బంటుగ నేలికొమ్మనుచుఁ బట్టినయప్పు డదేల యియ్యకో
కుంటి వృథాభిమానముననుంటఁ గళావతిమాట లేమిగా
వింటిఁ బ్రసూనసాయకుని వింటిదృఢత్వముఁగంటి బేలనై."

కళావతి చదివిన ఆ పద్యములు విని రాజు సానందహృదయుఁడు; సదయుఁడు; లజ్జావదనుఁడు నయ్యెను. అప్పు డాజగతీ వల్లభు నవలోకించుచు "నటుమీఁదివృత్తాంతము నవధరింపు" మని కళావతి యిట్లువచించెను. "నే నాపద్యములు పఠించి యదరిపడితిని. ఆకాంతవలవంతకుఁ దల్లడిల్లఁజొచ్చితిని. అప్పు డాచతుర నిద్ర తెలిసినదానివలె లేచి, నన్నుఁగారవించి, పర్యంకతలముడిగ్గి భాగురాయణుని నిష్కుటకూటములోనికిఁ బోవుదము రమ్మనిపిలచెను. ఎటులయినఁ బ్రొద్దుగడపుట కార్యమనితలఁచి నే నందుల కనుమతించితిని. ఉభయులము వెళ్ళి యందుఁ బ్రవేశించితిమి. పూవుఁదేనియలఁగ్రోలు నెలదేఁటి కదుపులు, చిగురుజొంపముల విహరించు కోకిలదంపతులు, పక్వానిలమున ఫలచయముఁరాల్చెడు రాచిలుకలు, పొదరిండ్లను బయళ్ళను బుప్పొడితావిలోనించు మలయమారుతము నామె మదనతాపమును మఱింత హెచ్చించినవి. అప్పు డాయబల సంచారకేళికిఁ దాళఁజాలక యొక లతానిలయమును బ్రవేశించినది. కాని యామె విరహవేదనాభరము కొంచెమయినను దగ్గలేదు. అంతకంతకు హెచ్చిపోయెను; ఆమె మోము వాడిపోయెను; నిట్టూర్పులు వెచ్చఁగా రాఁదొడఁగెను; తనువల్లికయందుఁ దాప మావహిల్లెను; గోష్ఠీవిహారములు పూర్తిగ విరమించెను. నే నాసమయమునందు నామె నా స్థలమునుండి యెట్లో నివాసహర్మ్యమునకుఁ గొనిపోయితిని. అప్పటినుండియు నామె క్షణ మొకయుగముగాఁ బుచ్చు

చున్నది. ఇది యాజోటివృత్తాంతము. ఇటమీఁద నీకే తెలియఁగలదు.''

ఇట్లు చెప్పఁగా విని మఱియును బసదనమునొసఁగి రాజు కళావతిని వీడ్కొల్పెను. పిమ్మట నాతఁడు చారాయణుని జూచి ''ఇది కలయో నిక్కమో మున్నెఱుఁగను. నిక్క మనుకొన్నను ఆస్త్రీ యెవ్వరో తెలియకుండెను. కాని యిప్పుడు కళావతి మాటలవలన సమస్తము దెల్లమయ్యెను. కులశీలాదులం దీకన్య నాకుఁ దుల్యురాలయినది. ఇట్టిసతిని దైవము నాకుఁ గూర్చినాఁడు. అవలీలగా నాలలనారత్నము నేఁకఁ బెండ్లియాడు టెట్లు?'' అనెను.

ఒకనాఁటి యుదయమున భాసురాయుఁడు శోకసహా పాయమునుగ అపి కళావతిని రత్నసుందరీదేవియొద్దకుఁ బంపెను. అప్పు డామె మేఖలాద్వితీయయైయున్న దేవిచెంతకుఁ బోయి యిట్లనియెను. ''మనరాజు విదూషకునిగొని మన మేఖలను మోసపుచ్చెను. ఇప్పుడు మన మాళాపనిపనికి సాయము చేయవలయును ; పార్థివతిలకుని వెలిపెట్టవలయును. నీవు తలఁచిన నిదియొక గొప్పపని కాదు.''

ఆమాటలకు దేవి సంతసిల్లుచు ''అట్లయిన మెచ్చుగల దది యేయుపాయము? చెప్పుము.'' అని యడిగెను. అప్పుడు కళావతి యిట్లువచించెను. ''మనరాజు భోగైకమగ్నుఁడు. అగుటచే నేమిచెప్పినను నమ్మును. కాని నిజము తెలియ నేరఁడు. కావున నీవు రాజుతో నిట్లు చెప్పుము. 'చండవర్మ పుత్రికయు, మృగాంకవర్మ చెలియలునగు నొకశుభాంగికలదు. ఆమెను పాణిగ్రహణము చేయువాఁడు సార్వభౌమత్వ విస్తార మహిమనందునని తొల్లి సిద్ధు లుపదేశించినారు. ఈ సంగతి

పెద్దలవలన వింటిని. ఒకఁడు సార్వభౌముఁడన నొప్పుచుండఁగా నీవు హీనుఁడవయి యుండుట నేను సహింపఁజాలను. కావున నాకన్యను నీవు పెండ్లియగుము. సార్వభౌమత్వము నీకే జరుగవలయును. అట్లులయిన నేను సార్వభౌముని నగ్రమహిషియన నఖిలనరేంద్ర వల్లభాభిసేవ్యనయి యుందును. ఏయుపాయమువలననైనను నాథునకు నభ్యుదయము కల్గించుట కులపాలికలకు నుచితధర్మము. ఆ రాచకన్నియ మాపినతల్లికూఁతురు. ఈ వివాహము నేను గావించునది. ఈ రెండుకారణములచేత నీ వామెను బరిణయమయిన నాకెట్టి యన్యాయము బుట్టదు. ఈ విధమున నీవుచేయుట నా యభిమతములు సకలమును నెఱవేర్చుటవంటిది. ఈకార్యమున కంగీకరింపకుండుట నాచనువులెల్ల నంగీకరింపకుండుట వంటిది.'' ఇట్లు నగనాథునకుఁ జెప్పి [illegible] అటుమీఁదఁ గార్యము నేను నెఱవేర్తును. మృగాంకవర్మకు మీసకట్టు లేదు. కావున అతనికి నేను ఆఁడువేషము వేసి శృంగారించి మృగాంకవర్మ చెల్లెలని ప్రకటించెదను. నిజమైన వివాహమునకువలెనే వలయుద్రవ్యములు సమస్తమును సమకూర్పుఁడు. ఈవిధముగా మాయలుపన్ని యామేఖలకానిని మోసపుత్తము. చారాయణుని తలఁపు తీరునట్లుఁ జేయుదము. మేఖలకుజరిగినపరాభవమిట్లు తీర్చుకొందము. ఈ రహస్యమును రాజు భేదింపలేఁడు. మనలను దప్పక నమ్మును.''

ఆమాటలకు దేవి ''అవును, నిజమే.'' అని ముదితచిత్తయై కళావతినిఁ గౌఁగిలించుకొని పసదనమిచ్చెను. పిమ్మట నామె ''కళావతీ! యీపని యభేద్యముగ నిర్వహించుట కెవ్వరినిఁబంపుదము?'' అని యడిగెను. అందుకు సుగుణా

నిలయమగు కళావతి "ఇట్టిపనులకుఁ దగినవారిని బంపవలయును. కావున మేఖలను బుత్తెంచుదు"అనెను. అప్పుడు దేవి యించుకవిచారించి "చెలీ! మేఖల యీకార్యము నెఱవేర్పఁజాలదు. చారాయణుఁడు కోఁతి. వానిమదమును, నాఖేదమును నీవే పోఁగొట్టఁగలవు. నాకొఱకు నీ వీపనిచేయక తప్పదు."అని కళావతి కరములుపట్టుకొని బతిమాలెను. "ఇది రాజునకు మందుచెప్పినవారికథ యయ్యెను"అని వగపు నటించుచు కళావతి "అట్లే చేయుదును"అని కదలి నృపతి సన్నిధికిఁ జనెను.

అపూర్వకముగఁ బొడసూపిన కళావతినిగాంచి రాజు గారవించి సమీపమునఁ గూర్చుండ నియమించెను. పిమ్మట రాజు చారాయణునితోఁ బ్రహ్లాదమున నిట్లనియెను. "కళావతి యపూర్వసంతోషవతియై యున్నది. ఈ సంతోషమునకుఁ గారణము వినవలయును." అప్పుడు కళావతి "కల్యాణపు సంతోషమును మించినసంతోషము జనులకు మఱియొకటి లేదు. అందును భూకాంతుని పెండ్లికి ముసలికి సంతసములకుఁ గొఱఁతయేమి?" యనెను. ఆపలుకులు విని సందియముతో నించుకయలరుచు మహీపాలుఁడు దాని కిట్లనియెను. "మేఘములలోని రహస్యమునుగూడ బ్రమచ్ఛేదించుకొని రాఁగలవు. అస్తగిరికిని, దామ్రపర్ణికిని సంగతి ఘటింపనేర్తువు. భూమి మీఁద నిన్నుమించిన బుద్ధిమతి నెచ్చటను జూడలేదు. క్రొత్త విషయము లేమిగలిగినవి? పెండ్లిముద మంటివి. అదియెట్టిది? చెప్పుము."

అందుమీఁద కళావతి భాగురాయణోపదేశమునఁ దాను దేవిని బ్రబోధించినప్రకారము సవిస్తరముగఁ జెప్పెను.

రాజును, చారాయణుండును ప్రశంసించుకొనుచు నిది వినిరి.
ఆపని ఘటింపఁబూని తానువచ్చుటకూడ కళావతి రాజున
కెఱింగించెను. పరమానందమునుబొంది ధరణీకాంతుఁ డామెకు
నత్యాదరమున దివ్యాంబరములు కట్టనిచ్చెను. "దేవితోడ
నీకుఁ దోఁచినట్లు చెప్పుము. ఇఁకమీఁదికర్తవ్యము నీకెట్లు
తోఁచిన నట్లు నడుపుము" అనిచెప్పి రాజు కళావతిని వీడ్కొ
ల్పెను. తదనంతరము కేయూరబాహుఁడు భాగురాయణుని
బుద్ధివిశేషమును గొనియాడి చారాయణునితో నిట్లుపలికెను.
"ఈవిధముగా దేవి మోసపోవునా? నడుమ నెట్టి విఘ్నము
లును లేక ఈకార్యము సఫలమగునా? లాటనృపకన్య నిజ
చరిత్ర మిచట నొరు లెవ్వరు వినకుండిరా?" ఆ మాటలకు
చారాయణుఁడు "నన్ను బేలు పెట్టుదునను తమకమున దేవి
యేదియుగమనింపదు. ఇది యవశ్యము సిద్ధించును." అనిచెప్పి
యూరడించెను.

అంతట కళావతి రత్నసుందరిచెంతకుఁబోయి వికసితా
ననయగుచు మ్రొక్కి "దేవీ! మనుజేంద్రుని నొడఁబఱిచి
తిని. అతనిసఖుని మాయాజాలమునఁ గట్టితిని. రహస్య
భేదనముగాకుండ మీఁదటిపని యొనరింపుము" అని చెప్పెను.
దానికి సంతసిల్లి రాణి కళావతికి నభినవాంబర భూషణము
లొసంగెను. పిమ్మట కళావతిపోయి యావిధమంతయు భాగు
రాయణునకు వినిపించి యాతనిప్రసాదము వడసెను; మృగాం
కావళి కెఱింగించి మహానందమునఁ దేలు నారాజనందన చేత
మెప్పులందెను.

## ౧౧

# వివాహమహోత్సవము

అంతిపురమున దేవి పెండ్లిపనులు సాగించుచుండెను. అప్పుడే ముహూర్తకుని రప్పించెను. అతఁడానాఁటిపూర్వాహ్ణమున నతివిశిష్టమగు వివాహలగ్న మున్నదని చెప్పెను. అప్పుడు రత్నసుందరి నాఁడే వివాహమని కళావతిచేత రాజునకుఁ గబురు చేసెను. రాజందుల కనుమతించెను. ముదమంది రత్నసుందరి నగరు, పురము నలంకరింపఁదగిన కర్మకారులఁ బనిచెను; మృగాంకవర్మకుఁ గాంతాలంకార మలవడఁజేయుమని యుక్తి ప్రయత్నమునఁ గళావతిని నియోగించెను; రాజునకై సేయు నభినవప్రసాధనరచనానిపుణులగు చతురుల కానతిచ్చెను. అంతట లగ్నమాసన్నమయ్యెను. అప్పుడు రాణివంపున రాజకన్యయు, కేయూరబాహుఁడును బరిణయమండపమున నాసీనులైరి. ఆకల్యాణవేది కస్తూరితో నలుకఁబడియుండెను. ముత్యాలముగ్గులు పెట్టఁబడియుండెను. రత్నతోరణములు కట్టఁబడియుండెను. అచ్చటఁ బుణ్యాంగనలు మంగళద్రవ్యములు నించిన కాంచనపాత్రికలఁ బట్టుకొని నిలిచియుండిరి. విప్రగణముచేయు వేదఘోష మిన్నుముట్టుచుండెను. అట్లమరియున్న వేదిస్థలమునఁ గూర్చుండి మృగాంకావళియు, కేయూరబాహుఁడును సమంత్రకకృత్యములు క్రమమున చేయుచు హోమమొనర్చుచుండిరి. ఆ సమయమున దేవియు, నాప్తపరిచారికలును హాసోద్యోగులయిరి.

ఇంతలో నచ్చటికి భాగురాయణుఁడు నచ్చెను. రత్న సుందరి చేయించు నుపచారములను గైకొని యుచితస్థలమున నాసీనుఁడయి మంత్రి యామెను ద్దేశించి యిట్లనియెను. "చండవర్మ మహారాజుసతియైన సుధామ దేవి మీపేర లేఖ పుత్తెంచె ననుచు నగరిమొగసాలయం దొకఁడు వేచియున్నాఁడు. వానిని బిలుచుకొనివచ్చుట కెవ్వరినైనఁ బంపవలయును." అందు మీఁద దేవి పరిచారిక నొక్కతెను వానిఁ గొని తేరఁబంపెను. వాఁడు వచ్చి దండప్రణామమాచరించి హరిద్రాముద్రమయిన లేఖ రాణిచేతి కందిచ్చెను. దేవి యాలేఖను జదివించెను. అం దిట్లుండెను.

"స్వస్తి సమస్త ప్రశస్తిసమేత సుధామహాదేవి తన తనయకు స్వస్తి సమస్త ప్రశస్తిసమేతయై తగగిన రత్నసుందరికిఁ బ్రీతిని వ్రాయునది యేమనఁగా—నీ కిపు డొకచిట్టితమ్ముఁడు కలిగినాఁడు. ఇప్పుడు నీపురమునయున్న మృగాంకవర్మ నీకుఁ జెలికత్తెలుగాని తమ్ముఁడుగాఁడు. తొల్లి మాకు సుతుఁడు లేకపోవుటచేత నామెకు మగపేరు పెట్టి మగవానిఁ జేసి పెంచినాము. ఇప్పుడు నీవే యాకన్యను దగినవరునకిచ్చి పరిణయము చేయుము. ఆకన్యనుబొందిన భూపతి భూమిమీఁద సార్వభౌముఁడగును. ఇది మునివరభాషితము."

ఆలేఖ నాకర్ణించి రాణి వెల్లవాఱుచు ఆచ్చపడియెను; ముచ్చముడిఁగి మూర్ఛావివశ యయ్యెను. ధైర్యము తెచ్చుకొని యప్పుడామె నిలుచుట యొకయద్భుతమయ్యెను. అట్లుండి తనలోన "ఇది యేమిచేసికొంటిని ! జను లెల్లరు నా కు మతి లేదని నవ్వెదరు. నవతివచ్చినందుల కోర్చినను జనులమాటల

కోర్వరాదు.” అని తలఁచి యామె పశ్చాత్తాపపీడిత యయ్యెను. “ఇది విధికృతము. దీనికి నధైర్యమునొంద కుండుటయే మేలు” అని మెచ్చునకు ధైర్యము దెచ్చుకొని రత్నసుందరి యవికారయై యుండెను. జను లితరులు చెప్పెడి మాటలు నమ్మి తమ రవి తెలిసికొనలేక, కార్యముల మెఱుఁగక యొరులను వంచింపఁగోరి రత్నసుందరివలెఁ దమకుఁ దామే వంచితులగుదురు.

భాగురాయణుఁడు తనయుపాయము సఫలమగుటకుఁ బ్రియమందెను. రహస్యమును వెలిపుచ్చక యితరులసాయమునఁ గార్యములన్నిటిని జనులు నేర్పరియైన భాగురాయణుని వలె నెఱవేర్చుకొనవలయును.

---

## ౧౨

# కేయూరబాహుని రాజ్యపాలనము

వివాహానంతరము కేయూరబాహుఁడు మృగాంకావళితోఁ గూడి కర్పూరకస్తూరికాపరిమళకరండములవంటి రత్నహర్మ్యములయందు నివసించుచు, కోకిలకీరాదికోలాహలమున విలసిల్లు నుద్యానవనములందు విహరించుచు, మత్తకేకులకు నృత్తరంగములయిన కేళిశైలములయందు క్రీడించుచుఁ, బరిమళకదళికాప్రాప్తలతాశ్రేణి నమరుదీర్ఘికలతీర

ములయందు వినోదింపుచు లబ్ధమనోరథుఁడయి యభిమత సుఖములఁ దేలుచుండెను. అట్లని యతనిని గామినీలోలుఁ డనుటకు వీలులేదు.

తేజస్వియగు నాతఁడు ఆజ్ఞ చేతనే శత్రువుల సాధించును. లోకనిందకుఁ జాల వెఱచును. అరులనైన నొవ్వఁగొనఁడు. భృత్యులఁ జెఱుపఁడు; వారు చేసిన గొప్ప కార్యములను మఱచిపోఁడు. కాని తప్పు గలిగిన శిక్షించు ధర్మరతుఁడు. ఇచ్చిన యీఁగి మగుడఁ గొనని సత్యవాది. క్రౌర్యము, లోభము, జాడ్యము, కపటము, వ్యసనములు—వీనిపొంతఁ జోవఁడు. ఆయమెఱిఁగి వ్యాయామముచేయును. అతనికిఁ గలగుట, ఉబ్బుట, ఏమాఱుట, భయము నొందుట, మూర్ఛించుట, చలించుట—అను దుర్గుణములు లేవు. ఇంద్రియవశ్యుఁడుగాక తేజస్వి, ధర్మరతుడు, సత్యవాదియునయి ఆతఁడు సుజనులచే వినుతుల నందెను. రాజధానీనగరము వలెనే యాతఁడేలు భూమియంతయుఁ దెలిసికొందెను. 'ఇది మరుదేశము, ఇది జాంగలరాష్ట్రము; ఇది సమతలము. ఇచ్చటి భూములు సారవంతమయినవి, ఈ భూమి సారము లేనిది, ఇచ్చట కొండ లున్నవి, ఇచ్చట నేఱు లున్నవి, ఇది యడవిప్రదేశము' అని ఆతఁడు తానుపాలించు దేశమునంతను గుర్తెఱిఁగియుండెను. ఒక్కొక్క కాలమున కెక్కడ దుర్గమునకు వినియోగమేర్పడు నని ఆతఁడు అవసరమయిన తావుల నెల్ల క్రొత్తదుర్గముల నేర్పఱిచెను. ఇదివరకె కేఉన్న దుర్గముల బలుపు చేసెను. సమీప భూపతులలో బలవంతుఁ డెవ్వఁడో, బలహీనుఁ డెవ్వఁడో, మిత్రుఁ డెవ్వఁడో, శత్రుఁ డెవ్వఁడో తెలిసికొని చతురుపాయముల వారిని జక్కఁజేయుచుండెను. రాజు, మంత్రి, దుర్గము,

రాష్ట్రము, వనము, సుహృదులు, బలము—ఇవి సప్తాంగము లనియెఱిఁగి యాతఁడు వానినిరక్షించెను.

స్త్రీలౌల్యమున సింహబలుఁడు చెడెను; జూదముచేత ధర్మరాజును, నలుఁడును గష్టములనొందిరి; అధికపానాసక్తి యాదవులు నశించిరి; వేఁటతగులున పాండురాజును, దశరథమహారాజును జెడిరి; వలుకుప్రల్లదమునఁ గౌరవులు పాడయిరి; పరుసనిదండమున జరాసంధుఁడు చేట్పడియెను; అప్రయోజననిఖిలార్థ పరిత్యాగమున హరిశ్చంద్రుఁడు భ్రష్టత్వ మొందెను. కావున సప్తవ్యసనములపొంతఁబోరాదని కేయూరబాహుమహీనాయకుఁడు వానినివర్జించి ధరాపాలనముచేసి సార్వభౌమత్వమందెను; ఎల్లెడ నెల్లరు బొగడ నెగడెను.

ఆధరణీపతికి శస్త్రమే బుద్ధి; సప్తాంగములే శరీరము; కార్యయత్నరహస్యరక్షణమే జోడు; చారులే దృష్టులు; సూతజనమే ముఖము; ధర్మవర్తనమే ప్రాణము.

సార్వభౌమత్వమంది కేయూరబాహుమహీనాథుఁడు ప్రజాపరిపాలనముచేయుచుండ నాతని రాజ్యమున జనులు వృత్తులుకలిగి, కలుములఁబొదలి ధన్యులయిరి; అత్యుత్తమ ధర్మకార్యములనొంది వసుంధర సర్వదానసంపత్తి వహించెను. ధర్మము కృతయుగమునందువలె నాలుగుపాదముల నడచెను; జనులకు గేహములందు నభీష్టవస్తువులు తామరతంపరలయ్యెను.